ఆగస్టు 1995

# స్రవంతి

'సాహిత్య విద్యా వేదిక స్రవంతి మాసపత్రిక'

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర,
ఖైరతాబాదు, హైదరాబాదు-500 004

## హిందీ ప్రేమీ మండలి, హైదరాబాదు ప్రమాణపత్ర వితరణోత్సవం

## తేది. 15 జూలై 1990



చిత్రంలో ఎడమనుండి కుడికి :- ఆంధ్ర సభ కార్యదర్శి కుమారి యస్.పి. వసంత, పాఠశాల విద్యా డైరెక్టర్ శ్రీ కె. వెంకారెడ్డి, మరియు ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తి.

# నవం

## సాహిత్య మాసపత్రిక

వార్షిక రుసుము : రూ. 15/–లు — విడిప్రతి : రూ. 1-50 పై

సంపుటి : 37 — ఆగస్టు 1990 — సంచిక : 5


437

()–()

సంపాదకులు

**ఎస్. టి. వసంత**

()–()


కార్యాలయం

**దక్షిణ భారత హి**
**ప్రచార సభ - ఆంధ్ర,**
**ఖైరతాబాద్, హైదరాబాద్**
**పిన్‌కోడ్-500004**


ఈ సంచికలో — పేజీ

సంపాదకీయం

# మహనీయ భారత్

శ్రీమంతుల సిరి, విజ్ఞానుల జ్ఞానం, సత్‌శీలుర త్యాగం, వైరులోని పంట, పసిడిలోని మెరుగు కలబోసుకు పుట్టిందే మన మహనీయ భారత్. ఏదేశ మేగినా ఎందుకాలిడినా... పొగడరా నీ తల్లి భూమి భారతిని అన్నది నిజం. ఏదేశానికి వెళ్లినా "మేం భారతీయులం" అని సగర్వంగా చెప్పుకోదగ్గ జాతి మనది. ప్రాచీనకాలంనుండీ అనైక్యతే మనల్ని బలహీనుల్ని చేస్తోంది. ఆ అనైక్యతే విదేశీయుల్ని మనదేశంలో కాలుపెట్టటానికి, సాహసం చేయటానికి అవకాశం యిచ్చింది. వర్తకం పేరిట వచ్చి, ఫ్రెంచి, ఆంగ్లేయులు వరుసగా దేశాన్ని తమ అధీనంలోకి తెచ్చుకోవటానికి ప్రయత్నించారు.

భారతీయులపై బ్రిటిష్ వారి దమనకాండకి ఉడికిపోయిన భారతీయులు 1857 సం॥ ప్రథమభారత స్వాతంత్ర్య సంగ్రామం జరిపారు. నానాసాహెబ్, తాంతియాతోపె, ఝాన్సీరాణి ఒక రేమిటి ఎందరో ఆ మహోద్యమంలో పాలు పంచుకున్నారు. ఆప్రథమ ప్రయత్నం విఫలమైనా భారతీయులలో చైతన్యం కలిగింది పూర్వవైభవం స్ఫురణకు వచ్చింది. జాతీయ భావం పెల్లుబికి ది. పర ప్రభుత్వంపై పరితపించిన ప్రజలు సన్నిహితులై సమైక్యంగా సమర శంఖం పూరించారు. అదేసమయంలో అంటే 1885లో భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన జరిగింది W.C. బెనర్జి, నైరోజీ, సర్ ఫిరోజ్ మెహతా, మహదేవ గోవింద రానడే, బాలగంగాధర తిలక్, గోపాలకృష్ణ గోఖలే, కందుకూరి వీరేశలింగం, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, బిపిన్ చంద్రపాల్, చిదంబరం పిళ్ళై, సుబ్రహ్మణ్య భారతి, అల్లూరి సీతారామరాజు, సుభాష్ చంద్రబోస్ ఒకరేమిటి ఎందరో త్యాగధనులు దేశసేవలో జీవితార్పణం చేశారు.

1920వ భారత రాజకీయ చరిత్రలో గాంధీప్రవేశం గొప్పమార్పును తెచ్చింది. ఆయన నిర్వహించిన సహాయ నిరాకరణ, విదేశ వస్తు బహిష్కారం ఖద్దరు ఉద్యమం బహుళ వ్యాప్తిని పొందాయి. జవహర్, రాజేంద్రబాబు, లాల్ బహదూర్, డా॥ సర్వేపల్లి మొదలైనవారి నేతృత్వంలో స్వాతంత్ర్య ఉద్యమ కార్యం మరింత ప్రబలం అయింది. 1930 సం॥ ఉప్పుసత్యాగ్రహం, శాసన ఉల్లంఘన, 1942 లో క్విట్ ఇండియా ఉద్యమంతో ఆంగ్లేయులు అధికారంపై ఆశ వదులుకొనేలా చేసి 1947 సం॥ ఆగష్టు 15 తారీఖు స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్నారు. అంతటి శ్రమ, కష్టంమీద సాధించుకొన్న స్వాతంత్ర్యం నిలుపుకోవటం అంతకన్నా శ్రమతో కూడుకొన్నది. విభేదాలతో, వివాదాలతో, కక్షలతో కార్పణ్యాలతో కలివిడి లేక కొట్టుకోవడం అవివేకం కాక మరేమౌతుంది, మనలో సమైక్యత భావసమైక్యత వల్లే వస్తుంది. శరీరంలో అన్ని అవయవాలు సరిగ్గా వుండేనే ఆరోగ్యం. అలాగే జాతిలోగల ప్రజలందరూ ఒకటైతేనే జాతి పురోభివృద్ధికి ఆరోగ్యం. జాతీయగీతం, జాతీయ ఝండా అలాగే జాతీయ భాషపై అపార గౌరవం ఉండాలి. అపుడే బంగారు భరిణ వంటి భారతదేశం మహనీయ భారత్ అవుతుంది.

సంపాదకులు

# జయహే గిరిజన!

* పొతూరి రఘురామయ్య

శ్రీకరమౌ అరణ్య మాతృహృదయం
సమస్త మానవ శాంతి శ్రీనిలయం

పరికి పొదలలోకి
వెలుగు చూపుల సాచి
ఫలములను గాంచెను
లేత కిరణములబోలు చిరుతలు!
తీరు తీరున తేజరిల్లెడు
ఆకులలముల శోభగాంచుచు
నడిచె బాలకులు పలుదారులన్
కలతలేవో తొలగునట్లు
పులకములేవో పొంగికూసెను!

గంట గంటకు గంట్రగొడ్డలు
లైన తీరుగ కిరణమాలలు పెరిగిపోవగ
తునికియాకుల సేకరించుచు
సాగిపోయిరి సాహసికులై అట్టిబాలలు!
ఎండిపోవగ నోరు
ఎంత త్రాగిరా నీరు
వింత దారుల దాటి
ఇంటి దారుల జేరగన్
నిండు బుర్రలు ఖాళీయై
మంట లెత్తెను శరీరముల్!

అక్కడిక్కడినీరుద్రావి
ఆకలన్నది మరచిపోతూ
అకులన్నవె ఆస్తులనుచూ
ఆకులందున మునిగి తేలిరి
వ్యాకులమ్ముల మరిచి జనమ్మంతయున్
రేబవళ్ళు కాలురొట్టల
లేచిపోయెడి పొగలమాదిరి

పొద్దుమాకులాగిరిజనమ్ము
సాగిపోయెదరటవికిన్, పత్ర
సేకరణమ్ముకై కడు జాగరూకతన్

ఓ బాలక! ఇప్పపూలు
చిల్లగింజ లేరే నీ చేతులు
దిద్దవలెను అక్షరాలు
నీ బ్రదుకు మారిమారి
చేరవలెను శిఖరాలు

ఓ సోదర! ఓ గిరిజన!
పోడుభూమి సాగులోన
కోల్పోయి సర్వస్వం
కోల్పోయితివా అట్టిభూమి?
కట కటా? కన్నీరా నీకుకాన్క?
కనులు తెరువు మంతె చాలు!
కలవు సకల శాసనములు
అవి మంగళా శంసనములు

గిరిజనులో అన్యజనులో
సమస్యలనెడి వలయంలో
నలిగిపోక వెలుగునటుల
కరుణ జూపవలెను ప్రభుత!
సాయపడుచునెంతొకొంత

జయహే గిరిజన జయహే
సకల జన శుభ కామనయె
నీ కామన గా సాగుము సోదర
శాంత మార్గమ్ములోన
సౌమ్యశీలమ్ముతోడ
శాంతి వెలుగులు కలుగగన్

సహకార కళాశాల
పో. రుద్రంగి
జి, కరీంనగర్. 505307

# దేశసంపద మనుషులోయ్

— సోంభేరి

దేశమంటే మట్టి కాదని
చిన్నబుచ్చితిమేమొ మట్టిని
మట్టిలో ధనధాన్య సంపద
మట్టిలో మహనీయ వ్యక్తులు
పుట్టగా మన బ్రతుకు బాటలు
గట్టిపడెనని మరచినామా?
మట్టి కూడా దేశ సంపద
మట్టి కూడ దేశమోయ్. 1

'దేశమంటే మనుషులోయ్' అన
విన్న దేశము వెక్కి ఏడ్చెను
కులము, వర్ణము, జాతి, మతము,
భాష, ప్రాంతము, ఆడ, మగలను
తెగలుగా విడిపోయి స్వార్థము
కనులు గప్పగ ఒకరి నొకరు
చంపుకొని తినుచున్న మనుషుల
కన్నదేశము వెక్కి ఏడ్చెను. 2

పంట భూముల ప్లాట్లు చేసి
ఫ్యాక్టరీలలో పనులు మాని
బడికి నామం పెట్టి తిరిగి
ఆఫీసు లందున నిద్ర మరిగి
చివికెలో శ్రీమంతులగుటకు
కిటుకు లన్వేషించు మనలను
'దేశసంపద మనుషులోయ్' అన
కన్న దేశము వెక్కి ఏడ్వదే. 3

పనిని తప్పక తిరుగు ధోరణి
పాతకంబని తెలుసుకుందాం
చెమటలోడ్చుచే బాగుపడుటకు
మంచి తారక మంత్రమందాం
ఉన్నదది కాసింతగానీ
ఇరుగుపొరుగుతో పంచుకుందాం
'దేశసంపద మనుషులోయ్' అని
ఆచరణలో చూపుదాం. 4

39 ఎ. సంజీవరెడ్డి నగర్
హైదరాబాద్-500038

# స్వాతంత్ర్య గీతం

వీరబత్తిని శ్రీశైలం

దేశమంటె భక్తి ఏది?
జాతిఅంటె ప్రేమ ఏది?
ఎందుకు యీనిర్లక్ష్యం?
ఎవరుగలరు నీపక్షం?

ఎందరిరక్తపు పద్మమొ
ఈ సుందరభారతమ్ము
ఎందరిఆశల అద్దమొ
ఈస్వేచ్ఛా జీవితమ్ము

నీతికొరకు జాతికొరకు
నిలబడి పోరాడినారు
సర్వస్వము ధారబోసి
జాతిని నడిపించినారు.

పెద్దలు చూపిన దారికి
హద్దులు మనమేయవద్దు
ముద్దుల భారతికి మొక్కి
మురిసిపోవుటే హద్దు.

స్వార్థమ్మును చంపివేసి
సౌశీల్యము నింపివేసి
నీదేశము నీజాతిని
నీవే నడిపించవోయి.

కులమతాలుఎన్నిఉన్న
కలతలు మనకెన్నిఉన్న
భారతీయులొక్కటనే
భావము రగిలించవోయి.

భారతీయస్వాతంత్ర్యపు
పావనగీతమ్ముపాడు
జాతిని మునుముందునడిపి
సాగరాలు దాటి ఆడు.

పోస్టు & మండలం చేర్యాల
జిల్లా వరంగల్
506223

# స్వతంత్ర్యభారతంలో సామాన్యుడు

— పాతూరి వేంకటేశ్వరరావు

1

అతనికి ఊక తెల్సిన తర్వాత
వేసవి వచ్చినప్పు డనుకున్నాడు,
ఒక్కజత చెప్పులు కొనుక్కోవాలని.
ఊ...హుఁ... అతని వల్ల కాలేదు :
రెక్కాడితేగాని డొక్కాడదని అతనికి,
ఏపూట కాపూట పొయ్యిలో పిల్లినిలేపి,
పిల్లల పొట్ట నింపటమే,
ఒక ఘనకార్యమై పోయింది :
అతని అవస్థ చూడలేనన్నట్లు
ముఖం చాటు చేసింది వేసవి :
రానున్న వేసవికి చూద్దాం లెమ్మని
సమాధాన పడ్డాడు ఆ అభాగ్యుడు :

2

వెంటనే తొలకరి వచ్చింది
హలో...! అంటూ అతణ్ణి పలకరించింది !
గొడుగన్నా కొనుక్కోవాల్సిందేనని
తనలో తను గొణుక్కున్నాడు :
గొణుక్కున్నంత మాత్రాన గొడుగొస్తుందా ?
కుంభవర్షం కురిసింది—తడిసాడు :
ముసురు పట్టింది—నానేడు :
తడుస్తున్నా, నానుస్తున్నా, కాటికిందెయ్యకుండా
బ్రతుకు బండి నీడుస్తున్న అతన్ని
వర్ష ఋతువు విసుక్కున్నది :
ఇతని చేత గొడుగు కొనిపించటం
బాబోయ్, నావల్ల కాదంటూ చేతులెత్తేసింది ;

3

తనతడాఖా చూపించాలనుకొనివచ్చింది,
వచ్చీరావటంతోనే అతని వళ్ళంతా కొరకటం
మొదలెట్టింది శిశిరం :
అబ్బా గొంగళి కొనుక్కోవాల్సిందేనని గింజు
కున్నాడు
గింజుకున్నా అతనిగొంగళికోర్కె తీరలేదు
వణుకుతున్న ఆలుబిడ్డలకు
నూలుగుడ్డలు కొనిచ్చేసరికి.
అతను చచ్చి బతికాడు :
రాత్రికి ఆలుబిడ్డల్ని కప్పుకుని
వేకువ చలి మంట వేసుకుని
తను ఒట్టొంటి తోనే సర్దుకున్నాడు :

4

అలా వేసవి, వర్షం, చలి వంతులవారీగా
ఈస్వతంత్ర భారతంలో సామాన్యుణ్ణి

హిందీకథ:

# నేర మెవరిది?

మూలం :

**కుసుమ్‌గుప్తా**

తెలుగుసేత :

**కాలిపు వీరభద్రుడు**

నిన్న జరిగిన దానికి అంతా నన్నే ఆడిపోసుకుంటున్నారు. హంతకున్ననుకుంటున్నారు. నేను దీపక్‌ని హత్య చెయ్యలేదు అయినా అందరూ నన్నే దోషిగా భావిస్తున్నారు. నా భార్య సీమ కూడా వేలెత్తి చూపిస్తూంది. దీపక్ తండ్రి బదరీనాథ్, దీపక్ తల్లి తమ కొడుకు చావుకి నేనే కారణమనుకుంటున్నారు. పోలీసులు నన్ను పట్టుకోలేదు నా కొడుకుని తీసుకుపోయారు. జామీనుకి ప్రయత్నించినా ఫలితం లేకపోయింది.

నిన్నటినుంచి మా యింట్లో మేమిద్దరమూ ఎంగిలి పడలేదు. కూతురు శాలినిని ఊళ్లోనే వున్న మేనత్త యింటికి పంపించేసాను.

నిన్నట్నుంచి నాలో తుఫాను మొదలయింది. హృదయ విదారకమైన యీ భీభత్స సంఘటనకి నేనే కారణమా? సీమ కాదా?

'మీరు తలచుకుంటే యీ అనర్థం జరక్కపోను. కాని మూర్ఖత్వంతో కూడిన డాంబికం గల లెక్చరర్ గదా మీరు. జీవితంలోని యదార్థాన్ని కాదంటారు. సైకాలజీ, ఫిలాసఫీ సూత్రాల్ని చిలక లాగ పలుకుతూంటారు.' నా మీద సీమ చేసిన ఆరోపణ యిది.

ఓ కాలేజీలో ఫిలాసఫీ లెక్చరర్ని నేను. నిజమే. సైకాలజీ చదవడమంటే నాకెంతో యిష్టం.

---

నిరంతరం వేటాడుతూనే ఉన్నయ్
అతను ఆదేపనిగా తనకోర్కెను
వాయిదా వేస్తూనే ఉన్నాడు :
తనకోర్కె తీర్చే వసంతంకోసం
నలభైరెండు వసంతాలు ?
ఎదురు చూసీ చూసి
విసిగి వేసారి పోయాడతడు :

ఇక ఎవరికోసమో ఎదురుచూడటం మానేసాడు :
తనే కళ్ళు తెరిచాడు :
తన బతుకులోని, చీకట్లను చెరిపేసేదేమిటో,
తెల్సుకున్నాడు : ముందుకునడుస్తున్నాడు :
ఆనందంగా—హృదయపూర్వకంగా—!
అరుణోదయానికి స్వాగతం పల్కుతున్నాడు :

తూర్పుకంభంపాడు పోస్టు
(వయా) అద్దంకి
ప్రకాశం జిల్లా 523201

ఇది నిజమే. సీమకంటే నా జీతం తక్కువనే సంగతి కూడా నిజమే. ఆమెకంటే యింట్లో ఎక్కువ కాలముండేది నేనే. అసలు కాలేజీ పనిచేసే దినాలు చాలా తక్కువ. వేసవి సెలవులు, దసరా సెలవులు. ఇవిగాక స్టూడెంట్స్ సమ్మెలు. అందుకు నేనేం చెయ్యను?

ఏడ్వర్ టైజ్ మెంట్ అండ్ రిసెర్చి కంపెనీలో సీమ ఒకానొక ఉన్నతాధికారిగా పనిచేస్తూంది. రోజుల తరబడి యింటికే రాదు. రిసెర్చి సర్వే చెయ్యడానికి ఎప్పుడూ బయటే ఉంటుంది.

ఇంటి బాధ్యత బలహీనమైన నా యీ దార్శ్యనిక భుజాలమీద పెట్టేసింది. నా పద్ధతిలో నేను యింటిని నడుపుతున్నాను. నా భావాల కనుగుణంగా నా యిద్దరి పిల్లల్ని పెంచుతున్నాను.

నా భావాలు వాస్తవిక జీవితంలోని కటు సత్యాలకి భిన్నమైనవని నాకు తెలియలేదు. ఈ విషయంలో సీమకి నాకూ మధ్య తరచు వాగ్వివాదాలు జరుగుతుండేవి.

'పుస్తకాల్లో ఉన్న జ్ఞానంతో పిల్లల్ని పెంచలేం. ముద్దుగా చూడవలసి వచ్చినప్పుడు ముద్దుగా చూడాలి. దండించవలసి వచ్చినప్పుడుదండించాలి.'

'పిల్లల్ని స్వేచ్ఛగా విడిచిపెట్టాలి సీమా. అప్పుడే వాళ్ళు ఆరోగ్యంగా సహజంగా అభివృద్ధి చెందుతారు. వాళ్ళ వ్యక్తిగత విషయాల్లో మనం జోక్యం చేసుకోకూడదు. అలాగయితే జీవితంలో క్లిష్ట పరిస్థితుల్ని ఎదుర్కొగలిగే శక్తీ, విశ్వాసం వాళ్ళకి కలగవు.' నేను నా సిద్ధాంతాన్ని విశదీకరిస్తూ వుంటాను.

'మీరు చూపించే యీ ఉదాసీనత, ఉపేక్షల వల్లనే రాజీవు పాడవుతున్నాడు. మొన్నటి హాఫియర్లీ పరీక్షల్లో వాడి మార్కులు అరవైశాతం కంటే తగ్గిపోవడం మీకు తెలిసిందే ...'

'వాడెందుకు శ్రద్ధగా చదవడేదో అర్థం కాకుండా వుంది.'

'సాయంకాలమంతా ఆటలాడుతూనో, మిగతా పిల్లల్తో తగువులాడుతూనో గడిపేస్తాడు. రాత్రి టీవీ. దగ్గర అతుక్కుపోతాడు. టెన్తు చదువుతున్నప్పుడే యిలా వుంటే వాడింక మన చెయ్యి దాటిపోతాడేమో అనిపిస్తుంది.'

'పసితనం గదా. పరీక్ష తప్పడమనే ఒక్క మొట్టికాయ తగలడంతో వాడే దార్లోకి వస్తాడు. మంచినీ, చెడునీ వాడే తెలుసుకోవాలి.'

'పెద్దల మార్గదర్శకత్వం ఫలితాన్నివ్వ ఉంటారా?'

'మార్గదర్శకత్వమంటే చెయ్యిపట్టుకొని నడిపించడమా?'-దాంతో సీమ వాదించడం మానేస్తుంది. అలాగని మేమెప్పుడూ కంఠహించుకోలేదు. మా వైవాహిక జీవితం హాయిగానే గడుస్తూంది.

నిన్న శనివారం. స్కూళ్ళకీ కాలేజీలకీ సెలవు. టిఫిన్ తిన్నాక వాలు కుర్చీలో హాయిగా పేపరు చదువుతూ లాన్‌లో కూర్చున్నాను. చలికాలం. ఎండలో హాయిగా వుంది. సీమ ఆఫీసుకి వెళ్ళిపోయింది. శాలిని లోపల టిఫిన్ తింటూంది. ఎదురుగా పిల్లలపార్కులో స్నేహితులతో కలిసి రాజీవ్ క్రికెట్ ఆడుతున్నాడు.

పిల్లల సైకాలజీకి సంబంధించిన వ్యాసమొకటి పత్రికలో వుంటే శ్రద్ధగా చదువుతున్నాను.

అప్పుడే పార్కులోంచి పిల్లల కేకలు వినిపించాయి. పిల్లలు తగవు లాడతారు, మళ్ళీ అంతలోనే కలిసి పోతారు.

పిల్లల తగవుల్లో పెద్దలు జోక్యం చేసుకో కూడదని నా అభిప్రాయం. అప్పుడే కీచులాడుకుం టారు, కొట్టుకుంటారు, ఓ పది నిమిషాల్లో మళ్ళీ కలిసిపోయి ఆడుకుంటారు. పెద్దలు వాళ్ళ తగు వుల్లో దూరితే ఆ మధుర సంబంధంలో పగుళ్ళు ఏర్పడతాయి.

అందుచేతనే నేను వాళ్ళ కేకలవైపు నా మన స్సుని మళ్ళించలేదు. పేపరు చదవడంలో మునిగి పోయాను.

'అంకుల్, రాజీవూ దీపక్ కొట్టుకుంటు న్నారు. రక్తాలొస్తున్నాయి.' నా వెనకనుంచి ఓ పిల్లాడి మాటలు వినిపించేయి. తిరిగి చూసాను. దీపక్ తమ్ముడు సుమన్ భయాందోళనలతో నిల్చున్నాడు.

'కొట్టుకుంటున్నారా, ఓ పది నిమిషాల్లో వాళ్ళే మళ్ళీ కలిసిపోయి ఆడుకుంటారులే.' తట స్థంగా ఉపేక్షాభావంతో అన్నాను.

'దీపక్ ని రాజీవేమో వికెట్లతో కొడు తున్నాడు.' ఇంచుమించు ఏడుస్తూ అన్నాడు.

'అయితే వెళ్ళాలి'- మనస్సులో అనుకున్నాను.

లాభం లేదు. గతవారం ఏమయిందీ. మనో హర్ వాళ్ళ అబ్బాయితో మా రాజీవ్ గొడవపడ్డాడు. సీమ వెళ్ళమంటే వెళ్ళేను. మేమిద్దరం విరోధుల మయ్యాం. పిల్లలు మాత్రం భుజాల మీద చేతులు వేసుకు తిరుగుతున్నారు.

మౌనం వహించిన నన్ను చూసి సుమన్ పారి పోయాడు. బహుశా మరో మధ్యవర్తికోసం పరు గెత్తి ఉండాలి-'సరే, వెళ్ళనీ. అనవసరంగా నేనెం దుకు మధ్యలో దూరడం. దీపక్ తండ్రి బదరీ నాథ్ తో లేనిపోని తగువులెందుకు?' నేననుకున్నాను.

అంతేకాదు, రాజీవ్ శారీరకంగా ఆరోగ్యంగా బలిష్ఠంగా ఉంటాడు. బాగా తింటాడు. ఆడతాడు. ఒళ్ళు బాగా పెంచాడు. ఎవరినన్నా కొట్టివస్తాడే గాని, వాళ్ళతో దెబ్బలు తిని రాడు.

రాజీవ్ వయస్సు కిశోరదశలో వుంది. ఇంకా యవ్వనం అంకురించని వయస్సులో ఉన్నాడు. ఈ వయస్సులో వాడు పొందిన విజయాలు ఆత్మ విశ్వాసాన్ని పెంచి భావి జీవితంలో కష్టాల్ని ఎదుర్కోడంలో శక్తినిస్తాయి.

ఇలా ఆలోచిస్తూ పేపరు చూస్తున్నాను. పిల్లల పార్కులో ఏడ్పులు చాలా హృదయవిదార కంగా వినిపిస్తున్నాయి.

ఓ అయిదు నిమిషాలు గడిచి ఉంటాయి. బదరీనాథ్ వచ్చారు. గట్టిగా అన్నారు- 'మీరిక్కడ పేపరు చదువుకుంటూ కూర్చున్నారు. అక్కడ పార్కులో రాజీవ్——"

'ఫిర్యాదుచేస్తూ బదరీనాథ్ వచ్చేసాడన్న మాట." మనసులో అనుకున్నాను.

'పిల్లలు గదండీ, పోనిద్దురూ. పది నిమిషాలు పోయాక వాళ్ళే మళ్ళీ కలిసిపోతారు.' నేనన్నాను.

'ఇంకేం కలుసుకొంటారండీ. దీపక్ స్పృహ తప్పి పడిపోయాడు. వాడి పొట్టలోంచి రక్తం బాగా కారిపోయింది. వేగం డాక్టరు దగ్గరికి తీసుకు వెళ్ళాలి.'

బదరీనాథ్‌లో కోపం కంటే విచారం ఎక్కువ వుంది. ఏదో జరిగిపోయిందని నాకనిపించింది. లేచి తొందరగా పార్కులోకి వెళ్ళాను.

పిల్లలూ పెద్దలూ అక్కడ మూగివున్నారు. బదరీనాథ్ భార్య నెత్తి మొత్తుకుంటూ ఏడుస్తూంది- 'నా కొడుకుని చంపేసాడు తల్లోయ్.' ఆమె ఏడుపు హృదయ విదారకంగా వుంది.

కరుణ కన్నీరు కారుస్తూన్నట్టుంది అక్కడి పరిస్థితి.

సరిగ్గా అప్పుడే ఓ కుర్రాడు ఆటో తీసుకొచ్చాడు. రాజీవ్ తల దించుకొని అపరాధిలా నిల్చున్నాడు. వాడి బట్టలు అక్కడక్కడ చిరిగిపోయాయి. ముఖం మీద చాలాచోట్ల రక్తం చిమ్ముతూంది.

'ఏమిటిది?' గర్జిస్తూ అడిగాను వాడ్ని.

రాజీవ్ అస్పష్టంగా అన్నాడు- 'నన్ను తిట్టాడు.'

మూగివున్న జనాలు ఆటోకి చోటిచ్చారు. బదరీనాథ్ కొంతమంది పిల్లలూ కలిసి దీపక్‌ని ఆటోలో పడుకోబెట్టారు. దీపక్ స్పృహలో లేడు.

అతని శరీరం నిర్జీవంలా వుంది. రక్తంతో తడిసిపోయాడు.

ఆటో బయలుదేరింది. ఆస్పత్రికి వెళుతున్నామని బదరీనాథ్ నాతో చెప్పారు.

'నేనూ ఆస్పత్రికి వెళ్ళాలి. దీపక్ తీవ్రంగా గాయపడ్డాడు. రక్తం బాగా పోయింది. నేనిలా ఆలోచిస్తూండగానే ఏడ్చుకుంటూ బదరీనాథ్ భార్య నా యెదుటికొచ్చి —'చూసారా, మీ గూండాకొడుకు ఘనకార్యం. దీపక్ పొట్టలో వికెట్‌తోపొడిచేసాడు.' అని అంది.

'నాకు తెలీదు ...' సిగ్గుతో సగం చచ్చి అన్నాను.

'తెలియక పోవడమేంటి, మీ మద్దతుతోనే ఆ పిల్లాడలా తిరుగుతున్నాడు'

'నా ప్రోత్సాహంతోనా?' ఆశ్చర్యపోయాను

'అవును, ఆ పిల్లాడ్ని మీరే చెడగొడుతున్నారు. ఏనాడైనా ఆ పిల్లాడి చేష్టల్ని ఓకంట కనిపెట్టి గదమాయించారా? ఆ అబ్బాయి చేస్తున్న గూండా పనుల్ని ఆపారా? ఆ పిల్లాడ్ని ఓ డాకూని చెయ్యాలనుకుంటూన్నట్టుంది మీ పద్ధతి చూస్తే.'

'మేడమ్ నాకేమీ తెలీదు...'

'అబద్ధాలెందుకండీ. మీకంతా తెలుసు. మా సుమన్ మిమ్మల్ని పిలవడానికి రాలేమా? నాకొడుకు ప్రాణం కంటే పేపరు చదవడమే మీకెక్కువా?...

నేనేమీ సమాధానం యివ్వలేకపోయాను.

'దీపక్ నాన్నగారు యింట్లో ఉండబట్టి వాడు బతికేడు. లేకపోతే, నా దీపక్‌నెప్పుడో చంపేసి ఉండేవాడు నీ కొడుకు.'

'నేను చాలా విచారిస్తున్నా ...'

నామాట పూర్తి కాకముందే- 'నా కొడుక్కేమైనా అయిందో, మిమ్మల్నేమిటి చేస్తానో చూద్దురు గాని' ఆమె అంది.

'ధైర్యంగా ఉండండి. మీ అబ్బాయికేం ఫరవాలేదు. ఆస్పత్రికి వెళుతున్నాను. అక్కడో డాక్టర్ నా ఫ్రెండ్.' అంటూ తొందరగా యింటికొచ్చాను.

రాజీవ్‌ని కోపంగా చూసి స్కూటర్ స్టార్ట్ చేసి ఆస్పత్రికి వెళ్ళాను. దీపక్‌ని ఎమర్జన్సీ వార్డుకి తీసు

కువెళ్ళారు. అక్కడికి వెళ్ళాను. డాక్టర్ దీపక్‌ని పరీక్షిస్తున్నారు. నాకు ఎంతో దుఃఖమూ బాధా కలిగాయి భయంగా కూడా వుంది.

దీపక్ కళ్ళు తెరవలేదు. బాధతో మూలగనన్నా లేదు. ప్రాణం లేని కట్టెలా వున్నాడు. ముఖం పసుపుపచ్చగా అయింది.

డాక్టర్ పరీక్ష పూర్తయింది. అతని ముఖంలో విచారం కనిపిస్తూంది. 'ఎలా జరిగిందిది?' డాక్టరడిగారు.

జరిగిన విషయాన్ని సంక్షిప్తంగా వినిపించాడు బదరీనాథ్.

'ఇది పోలీస్ కేస్ అవుతుందండీ' డాక్టరన్నారు

'డాక్టర్‌గారూ, పేషెంట్‌కి మొదట ట్రీట్‌మెంట్ విషయం చూడండి. తర్వాత పోలీసులు—' నేను సానుభూతితో అన్నాను.

'మీరెవరండీ మధ్యలో' అసహనంతో డాక్టరన్నారు.

'పిళ్ళప్పాయేనండి మాదీపక్ ని కొట్టింది.' ఎంతో దుఃఖంతో బదరీనాథన్నాడు.

డాక్టరెవరికో ఫోన్ చేసారు. ఆ తర్వాత బయటికొచ్చిన డాక్టర్ని వెంటనే నేనడిగాను—
'డాక్టర్‌గారూ, మరేం ఫరవాలేదా?'

'ఎందుకులేదు? ప్రేవులు దెబ్బతిన్నాయి. రక్తం బాగా పోయింది. ఎమర్జెన్సీ ఆపరేషన్ చెయ్యాలి. బ్లడ్ ఎక్కించాలి... ఆక్సిజన్ కావాల్సొస్తుంది'

'మరింక ఆలస్యం ఎందుకండీ.' విచారంతో నేను అన్నాను.

"పోలీసులికి ఫోన్ చేసాను. వాళ్ళొస్తూ ఉండొచ్చు. మొదట పోలీసులు కేసు నమోదు చేసుకోవాలి. ఆ తర్వాతనే ఓ. టీ లోకి తీసుకెళ్తాం.'

'డాక్టరుగారూ, అంతవరకూ అయితే లేటవుతుంది గదండీ.' బదరీనాథ్ గాబరాపడుతూఅన్నారు.

'ఏమయినా విధుల్ని పాటించాలి గదండీ."

రమారమి అర్థగంట వరకు టెన్షన్‌తోనూ, విచారంతోనూ ఎదురుచూసాక పోలీసులొచ్చారు. మా అందరి దగ్గరా వాఙ్మూలాలు తీసుకున్నారు. దీపక్‌లో చలనం లేదు. అంచేత దీపక్‌ని ఏ ప్రశ్నలూ అడగలేక పోయారు.

పోలీసుల ఎంక్వయిరీ పూర్తయాక ఆపరేషనథియేటర్‌కి స్ట్రెచర్ మీద దీపక్‌ని తీసుకువెళ్ళారు. మేమంతా బయట వరండాలో ఉండిపోయాం. దీపక్‌ని కాపాడమని దేవుణ్ని ప్రార్థిస్తున్నాం.

నాఫ్రెండ్ డాక్టర్ అనిరుద్ధ గుర్తొచ్చాడు. అతను కొంచెం యింటెరెస్ట్ తీసుకుంటే ఆపరేషన్ మరింత శ్రద్ధగా చేస్తారు గదా.

ఓ. పి. డి లోకి వెళ్ళాను. అనిరుద్ధ నెలరోజులు సెలవులో వున్నట్టు తెలిసింది.

మేమంతా రమారమి ఓ అర్థగంట వరకు వరండాలో నిరీక్షించాము. ఈ లోగా బదరీనాథ్ భార్యా, సీమ వచ్చారు. వచ్చీరాగానే సీమ నన్ను కోపంగా చూసింది.

'నీకెలా తెలిసింది?' నేనడిగాను.

'దీపక్ తల్లి ఫోన్ చేసింది. మీరు మా గొప్ప పని చేసారు. పిల్లాడొచ్చి మిమ్మల్ని పిలిచినా, వెళ్ళి రాజీవ్‌ని ఆపలేదంటే మీ వుపేక్షా భావానికి జోహార్లండీ.'

'వాళ్లు యింత ఘోరంగా దెబ్బలాడుకుంటున్నారనుకోలేదు.'

'అనుకోవడం కాదండీ, వెళ్ళిచూడాలి,'

బదరీనాథ్ భార్య కళ్లలోంచి కన్నీరు ప్రవహిస్తూంది. ఏడుపు నాపుకోడానికి ఆమె చేస్తూన్న ప్రయత్నం వ్యర్థమవుతూంది.

'నేనే యింట్లో వుంటే యీ అఘాయిత్యం జరక్కపోను. నేనెంతో బాధపడుతున్నాను.' సీమ ఆమెతో అంది.

'ఆ అబ్బాయి దుస్థితికి మీరే కారకులండీ. మీ ఉపేక్షాభావం ఎంత అనర్థాన్ని కలిగించిందో చూసారా? నాకు టైమ్ లేకుండా పోతూంది. లేకపోతేనా....' సీమ నాతో అంది.

'నిన్నెవరు ఉద్యోగం చెయ్యమన్నారు; మానేసెయ్. ఇంటిని పిల్లల్ని జాగ్రత్తగా చూసుకో.'

సీమ ఏమీ అనలేకపోయింది. ఆమె కళ్లల్లో ఎరుపుదనం మరింత చోటు చేసుకుంది

సరిగ్గా అప్పుడే ఆపరేషన్ థియేటర్ తెరచుకుంది. డాక్టర్ బయటికొచ్చారు బదరీనాథ్ తొందరగా ముందుకి వెళ్ళేరు.

బదరీనాథ్ అడక్కముందే డాక్టరన్నారు—'సారీ, ఎంతో ప్రయత్నించేం. కాని దీపక్‌ని రక్షించలేకపోయాం.'

బదరీనాథ్ భార్య స్పృహ తప్పి క్రింద పడిపోయింది. నాకళ్ల ముంద అంధకారం అలముకొంది.

అంతా అయిపోయింది. దుఃఖపూరితమైన యీ ఘోర సంఘటనకి కారకులెవరు? నేనా, సీమా? లేకపోతే ఫైట్స్‌తో నిండివున్న నేటి సినిమాలా?


హిందీ లెక్చరర్
శివాపురం స్ట్రీట్
నర్సీపట్నం-531 116
విశాఖ జిల్లా


## ఫిబ్రవరి 1991 నుండి ప్రారంభిక పరీక్షా శుల్కం వివరములు

| | | పరీక్షా శుల్కము | అంకసూచి శుల్కము | విలంబ శుల్కము |
|---|---|---|---|---|
| 1. | ప్రాథమిక | 9-00 | 4-00 | 1-00 |
| 2. | మధ్యమ | 14-00 | 4-00 | 1-00 |
| 3. | రాష్ట్రభాష | 17-00 | 4-00 | 1-00 |

పరీక్షా శుల్కము స్వీకరించు ఆఖరు తేది: డిసెంబరు 15, 1990
విలంబశుల్కముతో స్వీకరించు ఆఖరు తేది: డిసెంబరు 26, 1990
విశేష పరిస్థితులలో డిసెంబరు 27వ తేది నుండి జనవరి 5వ తేది వరకు ప్రత్యేక దండ శుల్కము రు. 5/-తో స్వీకరించబడును.

కార్యదర్శి

# వేదాతీతుడు వేమన

* మల్లంపల్లి విజయకుమార్

తిట్టు కవిత్వంలో కూడా "నాకియ్యలేదనే" బాధతోకాక, నీవు చెడిపోతున్నావని తిట్టే ధోరణి గల 'మానవతా మౌలికాంశం' వేమన్నలో విశిష్టంగా కనిపిస్తుంది. బహుశా ఇందుకేనేమో ఇతని కవిత్వాన్ని పండితులు సైతం హర్షించారు.

లోకంలో 'ధనం' వలన వచ్చే వ్యాజ్యం తరువాత ఉన్నటువంటి ప్రధానాంశాలలో 'వేశ్యా సంసర్గసిద్ధి' మరొకటి. ఈ రెండు జాడ్యాలు వేమన జీవిత పంథానే మార్చివేసాయి.

'సర్వోపాయ పరిభ్రష్టా వేశ్యాభవతి తాపసే'

అన్నట్లు వ్యసనం హసనమై తత్ఫలితంగా 'యోగ భావచేతస్కుడై' వేమన యోగిగా ప్రసిద్ధి గాంచాడు.

పైగా అప్పటి కాలంలో తన కళ్ళెదుట జరిగిన అన్యాయాలు, స్వార్థం, అధికారుల దౌష్ట్యం మొదలగు ధోరణులే, ఈ యోగిని ఇంటిలోని పోరు కన్నా ఎక్కువ కలత పెట్టినవి.

అందుకనే తను తెలుసుకొన్న జీవిత సత్యాలను ముందు తరాలవారి కందించడం కోసం, 'కవిత్వమే' అందుకు సరియైన మార్గంగా విశ్వసించాడు. ఆ పంథాలోనే తనుగ్రహించిన అద్వైత సిద్ధాంతాలను త్రోసి రాజని, తర్కబద్ధమైన తత్త్వాన్ని ఆశ్రయించాడు. అందుకే వేమన్నను 'యోగి' అనడం కన్నా 'తత్వవేత్త' అనడం ముదావహం.

సామాన్యంగా లోకంలో సంఘానికి చీడ పురుగుల్లాంటి సమస్యలున్నా, వాటిని వేలెత్తి ప్రశ్నించే 'మొదటివాది'కి ఎలాంటి కష్టాలుద్భవిస్తాయో, కోపర్నికస్-బ్రూనో-సోక్రటీసు వంటి దార్శనికుల జీవిత చరిత్రలే అందుకు తార్కాణం. కాని వేమన్న వేనినీ లెక్కించలేదు. చివరికి తను ధరించిన 'కౌపీనం' ప్రజల దృష్టిలో తనో వెర్రివానిగా భావింపబడినా లక్ష్యపెట్టక, వివేచనంతో, నిరీశ్వర వాదంతో-

'తల్లిగర్భమందు తాబుట్టినపుడు
మొదలు బట్టలేదు తుదనులేదు
నడుమ బట్ట కట్ట నగుబాటుకాదొకో'

అనే వైరాగ్యభావాన్ని విశ్వసించాడు.

వేమన చెప్పిన నీతిలో హేతువుంది. ఇంతకీ హేతువంటే ఏమిటి? కార్యాకారణ సంబంధాన్ని ఓ ఆలోచనాక్రమంలో పెట్టడమే హేతువౌతుంది. వేమన్న వాదంలో ఇది విస్పష్టమౌతుంది. అందుకు ఋజువుగా ఈ పద్యాన్ని చిత్తగించండి-

'పెదల వచనములు పే   జూచి తా
నటుల నడువ బోవ ననువు పడదు
పులి జూచి నక్క పూత పూసినయట్లు

అని అంటూ పెద్దల భావాలు, అన్నికాలాలకీ, పిల్లలకి పనికి వస్తాయనే 'ఆప్త వాక్యాన్ని' నిరసిస్తూ భావదాస్యం చెయ్యొద్దని, ఏదైనా హేతుపూరితంగా ఆలోచించమని హితవు చెప్తాడు.

ఆయా కాలాల్ని దృష్టిలో పెట్టుకొని వ్రాసిన ధర్మాలు, స్మృతులే మతాధారంగా ప్రజల్లో చొక్కి- 'మనోవికాసాన్ని', సామాజిక చైతన్యాన్ని మరుగున పరిచినవని ఆక్రోశించాడు. దానికై మత భావాల్ని యిలా తెగడుతూ-

'రాతిబొమ్మకేల రంగైన వలువలు
గుళ్లు గోపురములు కుంభములును
కూడు గుడ్డ తానుగోరునా దేవుడు?'

అని పేర్కొంటూ, నానాటికి జనుల్లో ధర్మబలం కన్నా మందబలమే మిన్నగా ఉండటాన్ని నిరసిస్తాడు. ఎందుకంటే ఏ మతానికైనా 'అంతర్గతాదర్శం' సత్యాన్వేషణమేగదా! ఇందుకు 'హేతువు'ను కూడా ఓ ప్రమాణంగా స్వీకరిస్తే, అంతకంటే మించిన 'విశ్వమతం' లేదన్నదే వేమన్న వాదం- అందునా జీవకారుణ్యాన్ని, మన తత్వ సిద్ధాంతాల్ని విశ్లేషిస్తూ-

"రాతిబసవని గని రంగుగా మ్రొక్కుచు
గునక బసవని గుద్దు చుంద్రు
బసవ భక్తులెల్ల పాపులు తలపోయ
విశ్వదాభిరామ వినుర వేమ!'

అని ప్రాణిలో శివున్ని చూడలేనివాడు, అచేతన జీవుల్లో చూస్తాడని హేతుయుతంగా ప్రశ్నిస్తాడు. దీన్నే మరోకోణంలో చూస్తే విగ్రహారాధన నిరసన పట్ల ఆయనకున్న వైఖరికి నిదర్శన మిదన్నట్లు తోస్తుంది. అంతేకాక మూఢనమ్మకాల్నీ, గుడ్డి సంప్రదాయాలను తిరస్కరిస్తూ-

'తలలు బోడులైన తలపులుబోడులా?' అని భౌతిక వాస్తవ దృష్టిని ప్రదర్శిస్తాడు.

కేవలం అనుభవాన్ని ఆశ్రయించక శాస్త్రం మీద ఆధారపడటం, వెలుతురు కోసం 'చిత్రించిన దీపాన్ని' ముందు పెట్టుకోవడం లాంటిదని హాస్యమాడాడు. వర్ణవ్యవస్థ సమర్థనీయం కాదని, ఇహలోకపు విలువల్ని, శ్రమశక్తి విలువల్ని సూత్రీకరిస్తాడు.

భాష లెన్నున్నా భావమొకటే, అనే విశ్వభావన తెలిపాడు. 'తప్పు లెన్నువారు తమ తప్పెరుగరని' సకలశాస్త్ర పారంగతుడై కుండే మానవతా దృష్టిని, సరసత్వాన్ని, సామాజిక చైతన్య దృష్టిని వివరించాడు. వేమన చెప్పిన నీతులు, నిజానికొక్కచోట వేదాలనుసైతం వెక్కిరిస్తున్నా, ప్రజలు వేమన్న చెప్పిందే వేదంగా, పరిగణించడంలో గల 'ఔచిత్యం" ఎలా పొసిగింది? అనే ప్రశ్న ఉదయిస్తుంది.

బహుశా అప్పట్లో ఆనాటికే మారని 'సాంఘిక విలువలు' పట్ల ప్రజలే ఏహ్యాభావం పొంది ఉంటారు. తాము కోరుకొన్న 'సాంఘిక నీతిని' లౌక్యాన్ని వేమన్న చెప్పిన పద్యాల్లో తరచి చూసారు, ఆచరించారు. వేదాల పరమార్థం కూడా 'నిత్య సత్యమే' గదా. మారుతున్న కాలానుగుణంగా ఈ నగ్నసత్యాన్ని నూతన సత్యంగా ఆవిష్కరించడానికే కాబోలు.

'వేదా తీతుడు వేమన సుమ్మీ!
వేమన వాక్యం వేదం సుమ్మీ!!'

అని ప్రజలు వేనోళ్ళ కొనియాడి, వేమన్న చెప్పినదే వేదంగా విశ్వసించారనడంలో అనౌచిత్యం లేదు గదా!

'ఊరక కృతుల్ రచియింపుమటన్న శక్యమే' అన్న నైజానికి విరుద్ధంగా వేమన 'జీవితం-సాహిత్యం' ప్రజల నోళ్లలో నానడమనేది, మహాప్రబంధ వైష్ణవ్య వ్యక్తులుగా స్మరించే మనా పాటి కవుల కన్నా 'ప్రజాకవి'గా కీర్తికెక్కిన వేమనే 'నిస్సందేహంగా' సిసలైన 'నవకవి'గా గుర్తించడం దార్శనికతకు సోపానం.

ఉన్నత శ్రీ సూక్తులతో కవిత్వాన్ని ఆశ్రయించే కొందరి మాటలు, ఆచరణంలో 'శ్రీరంగ నీతులు'గా మారడం, నాటికీ నేటికీ కనిపించడంలో ఆశ్చర్యంలేదు. ఈ రివాజుకు విరుద్ధంగా, అనుభూతితో కాక అనుభవాన్ని రంగరించి వ్రాసిన వేమన్న కవిత్వంలో, ఆయన వ్రాసిందే వాదంగా, వేదంగా మనము ప్రమాణీకరించడంలో దోషమేమీ లేదు. ఎందుకంటే-

'విన వలె నెవ్వరు చెప్పిన
విని నంతనె వేగ పడక వివరింపవలెన్
కని కల్ల నిజము దెలిపిన
మనుజుడె పో నీతిపరుడు మహిలో సుమతీ!

అన్న సుమతీ శతక కర్త సూక్తిని వేమన పద్యాలు వినడమే కాకుండా, తార్కికంగా ఆలోచిస్తే, మానవుడే మాధవుడై మహిని మహిమాన్వితం చేయగలడని ఆశించడంలో అతిశయోక్తి లేదు గదా!

తెలుగు డిపార్ట్‌మెంట్' నాగార్జున యూనివర్శిటి
నాగార్జున నగర్ పోస్టు
గుంటూరు జిల్లా, ఆం.ప్ర.



అందరు హిందీ నేర్చుకొనుట వలన భారత దేశమున కంతటికి భావ వినిమయములో సౌకర్యముగా నుండును.

—చక్రవర్తి రాజగోపాలాచారి

ప్రాంతీయ ఈర్ష్యాద్వేషములను తొలగించుటకు హిందీ ప్రచారమువలన లభించునంత సహకారము మరియే ఇతర సాధనముల వలననూ లభింపదు.

—సుభాష్ చంద్రబోస్

# మాయాప్రవరుని వంచనా శిల్పము: స్వారోచిష మనుసంభవము

— 'అమర లేఖిని'

ఈ విషయమును సవివరముగ దెలుపు ప్రయత్నమే ఈ వ్యాసము యొక్క ముఖ్యోద్దేశ్యము

సాహితీ సమరాంగణ సార్వభౌముడు, విజయ నగర సామ్రాజ్యాధీశుడైన శ్రీకృష్ణదేవరాయల పరిపాలనా కాలమునే 'స్వర్ణయుగము'గా విబుధశ్రేష్ఠులు పేర్కొనిరి. ఇందుకు కారణము లనేకములు

రాయల కాలమున ప్రజలు శాంతి భద్రతలు, సుఖ సంతోషములతో సుఖించుచుండిరి. అందుచే సాహితీరంగము మూడు పువ్వులు ఆరుకాయలుగా అలరారినది.

తెలుగు కవితకు పెండ్లి పందిళ్ళు వేసిన తీయని మరపురాని కాలమది

తెలుగు తల్లి గజ్జె కట్టి సరస సాహిత్యవైభవ గౌరవ వినోదములకు నోచుకొన్న కమ్మనికాలమది. నలిన సంభవుని రాణి తెలుగువాణి నేల నలు చెరగులా వ్యాపించినది.

శ్రీ కృష్ణదేవరాయల యాస్థానము నందు 'అష్టదిగ్గజములు' నాబడు నిష్ణాతులు, లబ్ధప్రతిష్ఠులైన మహాకవి శ్రేష్ఠులుండిరి.

'శృంగార ఏవ ఏకోరసః' అని భోజునిమతము

'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే
శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్'

అపారమైన కావ్యప్రపంచమునకు గవియే బ్రహ్మ అనగా సృష్టికర్త. అతడు తన యిచ్ఛాను సారముగా లోకమును మార్చును. అతడు శృంగారి యగుచో లోకమును శృంగారమయ మొనర్చును అని భావము.

ఏకత్రైవానురాగశ్చే త్తిర్యఙ్మ్లేచ్ఛ గతోపి వా
యోషితో బహుసక్తశ్చేద్రసా భాసస్త్రిధామతః

నాయికా నాయకులలో నొక్కరికి మాత్రమే యనురాగమున్నను, పశు, పక్షి మ్లేచ్ఛగతమై (అనురాగము) యున్నను బహునాయకానురాగమున్నను దానిని రసాభాస మందురు. ఇట్టిది ముత్త్రివిధములు.

మనుచరిత్రలో వరూధినీ ప్రవరులలో వరూధినికి మాత్రమే యనురాగమున్నది. కాన నా శృంగారము రసాభాసము. (ప్రవరుడు ఏకపత్నీ వ్రతుడు)

ఆనాటి 'భువనవిజయ' సభా భవనము సరస సాహిత్యగోష్ఠులకు నిలయమై ప్రత్యేకరంగస్థలియై, రసానంద పారవశ్యమున కపార సాహిత్య ప్రతిభా సమున్మేషహేలా విశేషముం కాట పట్టుగ నిల్చినది.

పండితులు మొదలు పామరుల వరకు రాయల సరస సాహిత్య పోషణమును ప్రశంసించిన వారే!

భువనవిజయ మహాసభాస్థలిలో రాయల వారి యధ్యక్షతను సాహిత్య గోష్ఠులు దినదిన ప్రవర్ధమానమై, రసహృదయులకు రసికహృదయులకు సహృదయుల కత్యంతమనోజ్ఞమై శోభిల్లుచుండెడివి.

ఆంధ్రభారతికి యాగోష్ఠులు నిత్యకల్యాణము పచ్చతోరణముగా విలసిల్లినవి :

అష్టదిగ్గజములలో విశిష్టస్థాన మలంకరించిన ఆంధ్రకవితాపితామహుడు అల్లసాని పెద్దనార్యుని గూర్చి-ముఖ్యముగా ఆయన జీవనవిధానమును గూర్చి తెలిసికొనవలెను.

భోగపరాయణత్వము పరాకాష్ఠ నందిన వాతావరణములో మసలుచుండిన వాడు సౌందర్యారాధనయు, రసికహృదయము గలిగిన వ్యక్తి. కావున నాతనిలో శృంగార రసపోషణ కుపయుక్తమైన యనుభూతి పరిణతి జెందినది

రాయలవారి కత్యంతప్రీతి పాత్రుడు ఈ క్రింది పద్యమును గమనించిన ఆ విషయము సుస్పష్టము :-

హితుడవు చతురవచోనిధి
వతుల పురాణాగమేతిహాస కథార్థ
స్మృతియుతుడ వాంధ్రకవితా
పితామహుడ వెవ్వరీడు పేర్కొన నీకున్ ?

అంతటి మహాకవీశ్వరుడు కావున రాయలు పెద్దనార్యప్రణీతమైన కృతిని గైకొనగ నర్థించెను. అకృత శిరీషకుసుమ పేశల సుధామయోక్తులతో నుండవలెనట :

సప్తసంతానములలోఁ బ్రశస్తిఁగాంచి
ఖిలముగాకుండునది ధాత్రిఁగృతియ కాన
గృతిరచింపుము మాకు శిరీషకుసుమ
పేశల సుధామయోక్తులఁ బెద్దనార్య !
ఒకనాటి నిండు సభలో :-

ఉ॥ ముద్దుగగండపెండియరమున్ గొనుడంచు బహూకరింపగా
నొద్దిక నాకొసంగుఁడని యొక్కరుఁగోరఁగ లేరులేరాకో?

అని ప్రశ్నించిన కృష్ణరాణ్మణికి ఆంధ్రకవితా పితామహుడు సవినయముగా నిచ్చిన సమాధానమును గమనించినచో బెద్దన యెంతటి మహాకవీశ్వరుడో సువిదితము.

ఉ॥ పెద్దనఁబోలు పండితులు పృథ్విని లేరని నీ వెఱుంగవే
పెద్దనకీఁ దలంచినను బేరిమి నాకిడు కృష్ణరాణ్నృపా.

రాయలు సంప్రశ్నములో నెత్తుకొన్న రెండు పాదములకు సమాధానముగ మిగిలిన రెండు పాదములతో ఉత్పలమాలను ముగించుటలోగల పెద్దనగారి పద్యపూరణము ప్రఫుల్లముగా, హృద్యముగా ననవద్యముగా నున్నది.

సంస్కృతాంధ్రముల యందు సమాన ప్రతిభతో గవనము జెప్పగలనని, రాయల కోర్కెను సవాలుగ గైకొని, పెద్దన సంస్కృతాంధ్ర పదగుంఫనముతో నాశువుగానొక ఉత్పల మాలికను వినిపించెను. అందలి కవిత్వ లక్ష్య లక్షణముల

గ్రహించిన రాయలు పెద్దన కవితా వైదుష్యమున కచ్చెరువొంది పితామహుని కాలికి గండపెండేర మును దొడిగెను.

పెద్దన కవీంద్రుడు చరితార్థుడుగదా!

వేఱొక సమయమున నేదేని కవిత నాశువుగా వినుపింపుమని రాయలడిగి నపుడు పెద్దన యిచ్చిన సమాధానము నీ పట్టున గమనింప దగినది :-

చ॥. నిరుపహతి స్థలంబు రమణీప్రియ దూతిక
తెచ్చి యిచ్చు క
ప్పుర విడె మాత్మకింపయిన భోజన మొయ్యెల
మంచ మొప్పు తి
ప్పరయు రసజ్ఞు లూహతెలియంగల లేఖక
పాఠకో త్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపు
మనంగ శక్యమే?

## స్వారోచిషమను సంభవము

మను చరిత్రమునకు స్వారోచిషమను చరిత్రము, స్వారోచిషమను సంభవము అని మఱి రెండు నామములు కూడ గలవు.

కాని, మను చరిత్రము అని బహుళ ప్రచారములో నున్నది.

మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రసమంచిత కథలన్
వినిపింపు కవి విధ్వంసక
మనసః భవచ్చతుర రచన కనుకూలంబున్.

స్వారోచిషమను సంభవము వినుటలో రాయలకు ప్రత్యేకమైన యభిమాన ముండుటకు గల కారణము:-

మార్కండేయ పురాణమున నెందరో మనువుల గాథలున్నవి. అందరు మనువులు మునుల-దేవతల సంబంధము కలిగిన వారయినందున నొక్క మనుష్య సంబంధము కలిగిన వారయినందున నొక్క మనుష్య సంబంధము గలిగిన స్వారోచిషమను సంభవము వినగ నిచ్చగలుగుటయే ప్రధాన కారణము.

పెద్దన ప్రణీతమైన మనుచరిత్రముఆరుఆశ్వాసములు గలిగిన మహాప్రబంధము మొదటి మూడు ఆశ్వాసములను ప్రథమార్ధముగను మిగిలిన చతుర్థ, పంచమ, షష్ఠాశ్వాసములను ద్వితీయార్థముగను పేర్కొందురు.

మనుచరిత్రము ప్రధానముగా శృంగార రస నిబంధిత ప్రబంధము. ఆఱా శ్వాసముల పర్యంతము రసరమ్య భావ బంధురముగ నాంధ్ర సాహిత్యముననొక మణిదీపికయై అలరారుచున్నది.

మాయాప్రవరుని వంచనాశిల్పమునకు దారి తీసిన హేతుభూతములు ప్రథమార్థములోని ప్రథమ, ద్వితీయాశ్వాసములు ప్రవరుడను విప్రకుమారునితో ప్రారంభమగును, ద్వితీయాశ్వాసము, ప్రవరుని హిమవన్నగముపైకి, ఒకానొక సిద్ధుని పాదలేపము ప్రభావముతో, జేర్చియచట నతడు వరూధిని యను గంధర్వ కన్యను గాంచుటతో ప్రారంభమగును. ఆ దినము సాయంసంధ్యాకాలముకాకమునుపే, పాదలేపము కరగిపోయిన కతమున, తిరిగి స్వగ్రామమైన యరుణాస్పద పురమందున్న నిలు సేరుటకు హవ్యవాహనుని స్తుతించెను. పావకప్రసాద లబ్ధంబగు పవనజవంబున ప్రవరుడు నిజమందిరమున కరిగి, నిత్యకృత్య సత్కర్మకలాపంబులు నిర్వర్తించెనని మార్కండేయుడు క్రోష్టికి జెప్పుటతో ద్వితీయాశ్వాసము ముగియును.

తృతీయాశ్వాసము, కపట ప్రవరరూపధారి యైన గంధర్వునితో వరూథిని ప్రణయకేళీ కలాప సంరంభముతో సాగును ముగియును తాను వంచింప బడినట్లు వరూథిని యెఱుగదు. ఇందలి విచిత్రమిదియే! దానిని వంచనా శిల్పముగ దెలియ వచ్చును

కపట ప్రవరరూపధారియై, మోసప్రవృత్తితో వరూథినీ పొందుకే పొంచి యుండి, హిమవన్నగమును వీడి నిజగృహమునకు వెడలిపోయిన ప్రవరుని వృత్తాంత మెఱిగినవాడై, ఆ మరసటి దినమున, సమయ సంపర్కమునెరసికొన్నవాడై, గంధర్వుడు తన యభీష్టసిద్ధిని కపటోపాయముతో ప్రియసంభాషణములు సాగించి వరూథినిని మోసగించ ఆమెను (వరూథిని) మరల వచ్చుచు పోవుచుండుమని చెప్పి శాశ్వతముగ కనుమరుగై యథేచ్ఛ జనియెను కావ్యాంతము వరకు ఈ రహస్యము దేవరహస్యమై నిలిచె. గంధర్వుని నిష్క్రమణముతో తృతీయాశ్వాసము ముగిసెను.

ఇదియొక ధ్వనిపరీతమై, భ్రాంతి నాధారముగ సాగిన కావ్యము ఇందులో వంచనా శిల్పము కావ్యశిల్పము కంటే గొప్పగా రాణించెను. చతుర్థాశ్వాసము నందుగల సీసపద్యము గమనించినచో నీ విషయము:— సుస్పష్టము

ప్రథమమున వరూథిని నాయిక అయిన, నాయకుడు ఎవరు? క్షుద్ర కామ పిపాసి, వంచకుడు అయిన గంధర్వుడా! ఎట్లు?

సీ॥ మున్ను విప్రాకారమునఁ గూడుచో శంకఁ
గను మూయఁ బనితె నా ఖచర భర్త
యవ్వరారోహయు నాసక్త గావున
నిచ్చలో నటు సేయ నియ్యకొనియె;
నా ప్రతిజ్ఞ పూర్తియయ్యెఁ దనంత న
వ్వనితకు రతి పారవశ్య పటిమ;

అపుడు తత్ప్రవరదేహసమిద్ధ శిఖదీప్తి
శాంబరీ మహిమచే సంగ్రహించి

తే॥ గీ॥ నట్టి గంధర్వమూర్తి సౌఖ్యానుభూతి
జలన మేదిన మానసాబ్జమున నిలువ
వెలసెఁ దేజోమయంబైన వృద్ధి నట్టి
మేటిగర్భంబు. నెలలుతొమ్మిదియు నిండె.

ఆ తరువాత వరూథిని ప్రసవించె నొక్కకుమారుని.

శా॥ తేజం బట్టి భవాండ గేహమునకున్ దీపాంకుర
చ్ఛాయయై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁజేరంబోని
లగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁగాంచె సుమనోరాజన్య
మాన్యున్ జనుల్
జేజే వెల్గుఁ బసూన వర్ష మమర శ్రేణుల్
వర్షింపఁగన్.

కం॥ స్వరుచి స్ఫురణను శశి భా
స్కర పావక తారకా ప్రకాశము లెల్లన్
విరళములు సేయ నతనికి
స్వారోచియను నామమిడి రచటి మునులెల్లన్.

వరూథినీ ప్రణయ వాంఛను దిరస్కరించి స్వస్థలముజేరిన వెనుక ప్రవరుని తనూ వైభవశ్రీలనీ క్రింది విధముగ వరూథిని వర్ణించెను —

ఉ॥ కమ్మని కుందనంబు గసుగందనిమే నెల
దేటి చాటులన్
బమ్మెర వోవఁద్రోలెడు తెగఁబాతెడు వెంట్రుక
లింద బింబముం
గమ్మన నీదుమోము గిరిక్రేపులు మూపులు
కౌను కానరా
దమ్మక చెల్ల! వాని వికచాంబకముల్ శత
పత్ర జైత్రముల్

ఇంతటియందు చందములుగల ప్రవరుని నలకూబరు సన్నిభుఁడని మెచ్చుకొని, యతని పొందును గాఢముగ వాంఛించినది. వాస్తవమునకు నిజప్రవరుడు నిత్యాగ్ని హోత్రి, నిష్ఠాగరిష్ఠుడు మరియునేక పత్నీవ్రతుడు. కనుక వరూధిని నొల్లకుండెను. వరూధిని విప్రకుమారుడైన ప్రవరుని మనసార వలచినది. (ఆమె ప్రేమమాయా ప్రవరుని పాలై, శృంగారమునకు స్థాయిభావమైన రతి పర్యంతము సాగెను).

మ॥ తరుణీ! రేపును మాపు హవ్యముల చేతం
దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణా దృష్టినొసంగు సౌఖ్యము వెలుం
గన్ శక్యమే నీకు? నా
కరణుల్ ధర్భలు నగ్నులున్ బ్రియము
లై నట్లన్యముల్‌గా, వొడల్
తిరమే జెప్పకు మిట్టితుచ్ఛ సుఖముల్ మీసా
లపైఁదేనియల్.

అని వచించినను ప్రవరునియందేవరూధిని మనస్సు లగ్నమై యున్నది.

ఉ॥ అక్కట! వాఁడు నా తగుల మాఱడిసేసి
దయా విహీనుఁడై
చిక్కక త్రోచి పోయె; దరిఁజేరఁగ రాని
వియోగ సాగరం
బెక్కడ నీఁదుదాన? నిఁక నీ కొఱనోములు
నోఁచినట్టినే
నెక్కడ వా. కౌఁగిలది యెక్కడ? హా! విధి!
యేమి సేయుదున్?

అని దుఃఖించును.

ఉ॥ చొక్కపుఁ బ్రాయమున్ మిగుల సోయగమున్
గల ప్రాణనాయకుం
డెక్కుడు వశ్యతన్ రతుల యేఁకేలుఁ దీర్చి
సమేళమొప్పఁగా
నక్కున గారవించి ప్రియమందఁగ నోఁచని
యింతి నైనయా
చక్కఁదనంబదేమిటికి? జవ్వనమేటికిఁ?
బ్రాణమేటికిన్?

అని వరూధిని వితర్కించెను. ఈ పల్కులలోని సత్యమును గ్రహించిన పాఠ కోత్తములు, మాయాప్రవర రూపధారియై, కాముకుడై వరూధినిని మోసగించిపోయెనన్న గంధర్వ భర్త వంచనా శిల్పము నెరిగి క్షమింపరు! ఒకచో క్షమించినను, విబుధులు హర్షించరు!

ఇం నెం. 8-3-214/29
శ్రీనివాసనగర్ కాలనీ (పశ్చిమ)
హైదరాబాదు-500390 (ఎ.పి).

# అభినవ పోతన-వానమామలై వరదాచార్యులు

... డా॥ మాధవరావు రేగులపాటి

వీరి జన్మస్థలము మడికొండ. దీని ప్రాచీన నామము మణిగిరి. మడికొండ కవి దేవతలకు గుడి. మడికొండ కావ్యమార్గాలకు మడి. ఉద్దండ పండిత మండల మండనాయకులకునిలయమీ మడికొండ. ఈ గ్రామమునసే వీరి జననముజరిగినది. వీరు సీతాంబ మరియు శ్రీమాన్ బక్కయ్యశాస్త్రిగారను పుణ్య దంపతులకు క్రీ.శ 16-8-1912 తేదిన జన్మించిరి.

వీరు భరద్వాజ గోత్రులు, ఆపస్తంబ సూత్రులు. వానమామలై యనునది వారి గృహ నామము. బక్కయ్య శాస్త్రిగారికి నలుగురు కుమారులు, ఇద్దరు కూతుండ్రు కలరు. వారి పేర్లు శ్రీమాన్ వెంకటాచార్యులు, లక్ష్మణా చార్యులు జగన్నాథాచార్యులు, వరదాచార్యులు, కూతుళ్ళు, కృష్ణమ్మ, అండమ్మ. వరదాచార్యులు చెన్నూరులో (ఆదిలాబాదు) నివాసమేర్పరచు కొనిరి.

వీరు మడికొండలో నాల్గవతరగతి చదివిరి. మంథెనలో 5,6 తరగతులు చదివిరి. గట్లనర్సింగాపూర్‌లో మిడిల్ చదివి పాసైరి. వీరి అన్నగారు వెంకటాచార్యులుగారు సంస్కృతాంధ్ర తర్క వ్యాకరణ వేదాంతశాస్త్రములను బోధించిరి. వీరు శ్రీ వాగీశ్వరీ మహామంత్రము, శ్రీరామ తారక మంత్రములను ఉపదేశ మంత్రములుగా గ్రహించిరి. బుద్ధి జాడ్యా పహారిణియగు వాగీశ్వరీ కటాక్ష భాగ్యము ప్రాప్తించిన నాటినుండి విద్యా విజ్ఞానముపై విశేషాభిమానము మరియు అభిరుచి కల్గినది. చిన్నతనముననే కవిత్వము, సంగీతము, చిత్ర లేఖనము మరియు అభినయము ఆదిగాగల అనేక కళలను నేర్చిరి. వీరు వీరి నాయనగారివద్ద సంగీతా భ్యాసము చేసిరి, తర్వాత పారంగతులైరి.

పదునెనిమిదవ ఏట వీరికి వివాహము జరిగినది. వీరి భార్యపేరు వైదేహి. వీరి మామగారిపేరు జగన్నాథాచార్యులు. వైదేహి మహా సాధ్వీమతల్లి. ఈతల్లి సద్గుణ గణ విరాజిత. వీరు తమ 25వ ఏట మడికొండ విడిచి చెన్నూరులో స్థిర నివాస మేర్పరుచుకొనిరి. వీరికి సంతానము లేదు. వీరి అన్న జగన్నాథాచార్యులవారి కుమారుడు రవీంద్రాచార్యున్ని దత్తత తీసుకొనిరి.

## కావ్యములు:-

వీరు చిన్ననాట 'దాగుడుమూతలు' అను గీత మాలికను రచించిరి. ఇందులో శ్రీకృష్ణుడు గోపికలతో దాగుడుమూతలు ఆడినట్లు వర్ణించిరి. ఇదొక ఆధ్యాత్మిక మహాకావ్యము.

దేశమాతను గూర్చిన 'మాతృప్రేమ' అను కావ్యమును రచించిరి. ఒక పౌరాణిక నాటకము రచించిరి. అది 'వైశాలినీ పరిణయము'. వారప్పుడప్పుడు రచించిన పద్యములను 'మణిమాల'గా గూర్చిరి. 'పోతనచరిత్రము'ప్రచురించిరి. మహాత్మా

గాంధీ హత్యానంతరము శోక సంతప్త హృదయము పెల్లుబుక ముప్పదియారు గేయములు రచించిరి. వాటిని 'ఆహ్వానము' అను ఖండ కావ్యమున చేర్చి ప్రచురించిరి.

ఒకప్పుడు వీరు క్షయవ్యాధితో బాధపడిరి. క్షయవ్యాధి నుండి బయట పడుటకు వీరు హైదరాబాదు వెళ్ళిరి. అక్కడినుండి మైసూరుకు వెళ్ళిరి. క్షయనుండి బయట పడుటకు డాక్టర్లు వారికి పది సార్లు ఆపరేషన్ చేసిరి. డబ్బుకొరకు అప్పుడు వారు పడినపాట్లు ఇంతింతని చెప్పనలవి కాదు. అయినా వీరు మృత్యువుతో పోరాడి విజయము సాధించి 1953వ సంIIమున హైదరాబాదుకు తిరిగి వచ్చిరి, వారు జీవించిన గాథను విని నివ్వెరబోని నరుడే లేడు. తెలంగాణారచయితల సంఘంవారు వీరికి అదే సమయంలో 'అభినవ పోతన' యనే బిరుదునిచ్చి సత్కరించిరి.

## ఉద్యోగము :—

అప్పుడు ముఖ్యమంత్రులుగా నున్న బూర్గుల రామ కృష్ణారావు గారిజౌదార్యము వల్ల వీరికి దోమకొండలోని జనతా కళాశాలలో ఉద్యోగమువచ్చినది. ఆతర్వాత వీరు ఆంధ్ర సారస్వత పరిషత్‌వారు నిర్వహించు తెలుగు విశారద పరీక్షవ్రాసి ప్రప్రథములుగా ఉత్తీర్ణులైరి 16-11-1954 నుండి 1-10-1961 వరకు చెన్నూరులోని ఉన్నత పాఠశాలలో అధ్యాపకులుగా పని చేసిరి. 1972లో ఉద్యోగ విరమణ చేసిరి. 1956లో పోతనచరిత్రను పూర్తిచేసిరి. భోగిని నాట్య ఘట్టమును 23 గంటలు ఏకధాటిగా వ్రాసిరి.

1966లోపోతనచరిత్రము ప్రచురింపబడినది కాని ఆ మహాకావ్య ప్రచురణకై పడినపాట్లు, ఎదుర్కొన్న అవరోధములు, ఎగిరిఎగిరి ఎదురుగా వీచిన విఘ్న విషన్న మేఘములు లెక్కలేనన్ని. 14-4-1967 న ఆంధ్ర సారస్వత పరిషత్తు హాలులో ఘనంగా ఆవిష్కరణమహోత్సవం జరిగినది. ఆ మహాకావ్యమునకు 1968లో ఆం. ప్ర. సాహిత్య అకాడమీ బహుమతి లభించినది. ఆతర్వాత స్తవరాజ శతకము రచించిరి. అయిదుగురు దేవతలస్తుతి యిందులోనున్నది. 'శ్రీసత్యనారాయణ వ్రతకల్పము' 'శ్రీవెంకటేశ్వర కరావలంబము' 'భజయతిరాజస్తోత్రము' 'విప్లవలక్ష్మి' కావ్యమును 1970లో ప్రచురించిరి.

## శాసనమండలి సభ్యత్వము :

15వ అగస్టు, 1972 నాడు ఉద్యోగవిరమణ చేసిరి. ఆతర్వాత విధాన పరిషత్సభ్యులుగా నియమించబడిరి. అప్పటినుండి 1978 వరకు వారు అదే పనిలో కొనసాగిరి.

## షష్టిపూర్తి ;

15-8-1971 నాటికి 60 సంవత్సరములు పూర్తి అయినవి చెన్నూరు ప్రజలు ఆ సందర్భంలో సువర్ణాభిషేకము గావించిరి. కోరుట్లలో ఘనంగా సన్మానసభ జరిగినది. గండపెండేరము స్వర్ణకంకణము సమర్పించబడినది రత్నాభిషేకము గావించబడెను. నిధి సమర్పించబడెను. 'అభినవపోతన' యనుపేర షష్టిపూర్తి సన్మాన సంచిక ప్రచురింపబడెను. వారిసాహిత్యమును గురించి ఒకగోష్ఠి నిర్వహింపబడెను.

## ఇతర రచనలు :

'వైశాలిని' అను నాటకమును 1975 లో ప్రచురించిరి.

'గీతారామాయణమును' అనువాద గ్రంథమును 1975లో ప్రచురించిరి. దీనిని శ్రీ గజానన

దిగంబరమాడ్ఖూళీకర్ మహారాష్ట్రిభాషలో రచించిరి. శ్రీ దోండుశాస్త్రీగారు దీనిని అనువదించుమని విజ్ఞప్తి చేసిరి. భోగినీపట్టములోని పద్యములను భోగినీలాస్యము అన్న పేరుతో ప్రచురించిరి. దానికి టీక స్వయముగా సమకూర్చిరి. 1977 లో 'హనుమాన్ చాలీసా'ను అనువదించిరి. 'కూలిపోయె కొమ్మ'అనే వచన కవితా సంపుటిని వెలువరించిరి. 'సూక్తి వైజయంతి' పేర 1978లో ఒక పుస్తకమును ప్రచురించిరి. ఇందులో 700 సుభాషితములున్నవి. 'మానవులంతా మనవాళ్ళే' అనే నవలను రచించిరి. ఇది అముద్రితము

వాల్మీకి, కాళిదాసు, భవభూతి, పోతన, పెద్దన తిక్కన రామరాజభూషణుడు, పింగళిసూరన విశ్వనాథ సత్యనారాయణ, తులసీదాసు, సూరదాసు, రవీంద్రుడు,షేక్స్పియర్,వర్డ్స్వర్తు మొదలైనవారు వీరి అభిమాన కవులు వ్యవసాయముకూడ చేయించిరి చెన్నూరులో వేద పాఠశాలనుస్థాపించి దానికి అధ్యక్షులై వెలసిరి.'సాహిత్యగౌతమి' అను సంస్థను స్థాపించి నడిపిరి.

వీరికనేక బిరుదులు కలవు. ఆంధ్రప్రదేశ్‌లో వీరికి అనేక సన్మానములు జరిగినవి. ఇన్ని సన్మానములు జరిగిన ఆంధ్రకవి మరొకరు లేరేమోయనిపించును. అకాశవాణిలో అనేక ప్రసంగము లొసంగిరి.

| | |
|---|---|
| కవివతంస | చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు ఒసంగిరి. |
| కవిశిరోవతంస | నిజామాంధ్ర వైష్ణవ సంఘం వారు |
| ఉత్ప్రేక్షాకవి చక్రవర్తి | గౌ॥ పి. వి. నరసింహారావుగారు |
| మహాకవి శిరోమణి | డోర్నకల్ పౌరులు |
| అభినవపోతన | తెలంగాణా రచయితల సంఘం |
| అభినవ కాళిదాసు | వైశాలిని ఆధారంగా |

రాష్ట్ర సాహిత్య అకాడమీ 31-1-197 నాడు విశిష్ట సభ్యత్వము నొసంగి గౌరవించినది

కాశీ విశ్వవిద్యాలయము 18-2-1976 నాడు వీరికి డి. లిట్ మరియు వాచస్పతియను గౌరవ పట్టమిచ్చి సన్మానించినది.

వీరికి ఎందరెందరో పుస్తకము అంకితమొనర్చిరి

| | | |
|---|---|---|
| "నవోదయము" | — | అందె వెంకట్రాజంగారు |
| కవిగౌడప్ప శతకము | | మామిండ్ల రామగౌడుగారు |
| భారతము | — | రావిగంటి వసునందన్‌గారు. |

దుర్ముఖి ఉగాది అనగా 1981 ఏప్రిల్ 5 నాడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిని సన్మానించినది.

వీరిజీవితంలో కొన్ని కార్యములు అసంపూర్ణముగా మిగిలిపోయినవి.

1982 లో ముషీరాబాదులో యిల్లు కట్టుకొనవలయునని తలంచిరి కాని అది నెరవేరలేదు.

'స్తవరాజ పంచశతి' తిరుపతి దేవస్థానము వారి ద్రవ్యసహాయముతో ప్రచురింపదలచిరి. కాని అది నెరవేరలేదు.

31 అక్టోబర్, 1984 నాడు వారు పరమపదము చేరిరి.

వీరిజీవితములోని ఒక్కొక్క ఘటన గురించి ఒక్కొక్క మహాగ్రంథము వ్రాయవచ్చును. బాల్యము, యౌవనము, జీవనము, మరణము, వ్యాధిగ్రస్తము, గ్రంథలేఖనము, వ్యవహారము. జీవితయాత్ర ఒక్కొక్క అంశము ఒక్కొక్క మహాగ్రంథము. సద్గుణవరేణ్యున్ని, అభినవ పోతనను, మాన్యున్ని, మూర్ధన్యున్ని గురించి సాహిత్యనభమ్మున వెలిగిన జాజ్వల్యమానతారను, అనంతభావనచేసిన ఘనమేధను, అమూల్యకృతులు వ్రాసిన హస్తమును, వారిచిత్తమును, సభలనూపివైచిన రసద్గళమును, పుంభావసరస్వతివి, సకల సాహితీసామ్రాట్టును, మేటిగగన దీపమ్మును కొంత కొంత వివరించనైనది.

వరదాచార్యులు ఉత్తమకవులు. ఋషికల్పులై కవితా తపమాచరించిరి. భక్తిజ్ఞానశోభితులు. శ్రీ సత్యనారాయణ, శ్రీరామచంద్రుడు, మరియు వాగీశ్వరీదేవి వారియిష్టదైవములు. పద్మదళ విలసిత జలబిందు సందోహమువలె రాగియయ్యువైరాగిగా నిలచిన ఉత్తముడు. కావ్యనిర్మాణ ధురీణుడు. వారు ప్రాచీన అధునాతన నవభావాంబరవిహార వినిర్మగ్నులైన విద్వద్విలసిత మహాకవులు కామక్రోధాదులను నిర్జించి శమదమాది షడ్గుణసంపద్విరాజితులై యొప్పినారు.

వారు ఎన్నో విషయములను సూక్తులుగా సెలవిచ్చినారు అవి చాల ఉపయుక్తమైనవి.

అహంకారము దైన్యము రెండును పనికిరావని వాటియందు సమచిత్తులై మెలగవలయునని సెలవిచ్చినారు. అహంకారము వలన మానవుడు ఎదగలేడు దైన్యము వలన ప్రాణి క్రుంగిపోతాడు. అందుకే

> వెలుగు నీడల వోలె వెనుక ముందులనడుచు
> నిందాస్తుతులకొక్క వందనమ్మొనరింతు.

వారి మానవతావాదము కులమత వర్గాతీతమైనది. చాదస్తము లేని స్వచ్ఛమైన ధార్మిక జీవనులు. వీరు సాంప్రదాయికులయ్యు సన్మార్గము నాచరించు ప్రాజ్ఞులు. వీరికి వేషభాషాదులయందు అభిమానమున్నను దేశభక్తి, జాతీయత, సంస్కృతి ఆదిగా గల వాటియందు ఎంతో గౌరవ భావమున్నవారు.

వీరు తమ జీవితకాలంలో ఏబదికృతులు రచించిరి. అందులో కొన్ని అముద్రితములు. ఒకవంతు ముద్రితములు, రెండువంతులు అముద్రితములు...మహాకావ్యములు, గేయకావ్యములు, వచన కవితలు, ఖండ కావ్యములు, నాటకములు, నాటికలు, నవలలు, శతకములు, బుఱ్ఱకథలు, వ్యాసములు ఆదిగాగల సాహితీ ప్రక్రియలను చేపట్టిరి కేవలము 'కథ' ప్రక్రియను మాత్రము చేపట్టలేదు.

## ముద్రిత కృతులు

### 1. మణిమాల :

ఇదిఖండ కావ్యము, 1932 నుండి 1942 వ్రాసిన పద్యములను కూర్చి 1945లో ప్రచురించారు. ఇందులో 59 కవితలున్నవి,

## 2. ఆహ్వానము :

ఇది 66 కవితల సంపుటి 1947 నుండి1957 వరకు రచించిన కవితలు ఇందులో కలవు.

## 3. జయ ధ్వజము :

ఇందు 31 గేయములు కలవు. 1965లో పాకిస్తాను దండెత్తినప్పుడు వ్రాసిన కవితలు ఇందులో కలవు. ఇది 1966లో ప్రచురింపబడినది. ఇది చెన్నారెడ్డి గారికి అంకితమీయబడినది.

## 4 పోతన చరిత్రము :

ఇది 1966లో ప్రచురింపబడినది. పోతన మహాకవి, భక్తాగ్రేసరుడు, హాలికుడు వరంగల్ సమీపములోని బమ్మెరయనునది పేరిగ్రామము. ఆ పోతన జీవితగాథను మహాకావ్యంగా తీసుకొని ప్రబంధ రచనా శోభితంగా రచించారు. పంద్రెండు సంవత్సరాలు కష్టించి రచించారు. ఒక దశాబ్దకాలము మెరుగులు దిద్దారు. ఈ గ్రంధము పంద్రెండు ఆశ్వాసములతో, నాలుగువేల పద్య గద్యములతో శోభిల్లుచు విస్తరించి యున్నది. వీరు దీనిని శ్రీరామచంద్రుని కంకితమిచ్చిరి. ఇందులోని మొదటి పదియాశ్వాసములు పోతన చరిత్రకు సంబంధించినవి. రెండు ఆశ్వాసములలో రామ చరితము, మోహినీ అవతారగాథ వరాహావతారగాథ, నృసింహావతారగాథ, గజేంద్ర మోక్షము కృష్ణావతారగాథ, రుక్మిణీ కళ్యాణము అను ఏడు ప్రసిద్ధ భాగవత గాథలు పోతనచేత గానము చేయబడినట్లు వ్రాయబడినవి.

ప్రపంధ లక్షణములు సంతరించుకొన్న నీ మహాకావ్యము ఔచిత్యమునకు, ఉదాత్తతకు పేరెన్నికగన్నది. భక్తి శృంగార వీర కరుణ శాంత రసములు, చతుర్విధ పురుషార్థములు, భక్తి జ్ఞాన వైరాగ్యములు, ధార్మిక లౌకికనీతులు, ఒకటేమిటి సమస్త సాహిత్య విలువలు యిందు పొందు పరుపబడినవి. దీనికి 1968లో రాష్ట్ర సాహిత్య అకాడమీ అవార్డు లభించినది.

## శ్రీ సత్యనారాయణ వ్రతకల్పము :

స్కాంధ పురాణములో రేవాఖండమునందు శ్రీ సత్యనారాయణ వ్రత కథ కలదు. దాని అనువాదమిది. వానమామలై దంపతులు ప్రతి పూర్ణిమ నాడు ఈ వ్రతమాచరింతురు. ఆంధ్రులకిది అందుబాటులో నుండునటుల తెనిగించినారు. ఇది 1967లో ప్రచురింపబడినది.

మొదట వ్రతపూజావిధానము వర్ణించబడినది. అయిదు అధ్యాయములలో 174 పద్యములతో వ్రత కథ చెప్పబడినది. అధ్యాయాంతమున తాత్పర్యము తెలియజేయబడినది. చివరన లక్ష్మి అష్టోత్తర శతనామావళి, శ్రీ విష్ణ్వష్టోత్తర శతనామావళి, శ్రీ విష్ణు సహస్రనామావళి చేర్చబడినవి. శ్రీ సత్యదేవ మంగళారతి రచించబడినది.

## విప్రలబ్ధ :-

ఇదేగేయ కావ్యము ఇందు కథకూడ యిమిడి యున్నది. కావున దీనిని గేయకథా కావ్య మన వచ్చును. ఇది 1970 లో ప్రచురింపబడినది. ఇందు కర్షకుల జీవితమును యితివృత్తముగా తీసుకొని చక్కగా వర్ణించారు. నాయిక తన తల్లివారి యింటిలో ఉంటుంది భర్తను కలియుటకు సాహసించి గోదావరి దాట సాహసించినది. కాని దాని ధాటికాగలేక కొట్టుకొని పోయినది, విప్రుడు రక్షించగా ఆమెకు విప్రలబ్ధ అన్న పేరు కల్గినది.

## స్తోత్రరత్నావళి :-

ఇది స్తోత్రముల సంపుటి. ఇది అనువాద గ్రంథము. 1974లో ప్రచురించబడినది. ఇందులో

శ్రీవేంకటేశ సుప్రభాతము, శ్రీవేంకటేశ మంగళా శాసనము శ్రీ వెంకటేశకరావలంబస్తోత్రము, శ్రీ భజ యాతి రాజస్తోత్రము, శ్రీ భజగోవిందస్తోత్రము, శ్రీ లక్ష్మీనర్సింహకరావలంబస్తోత్రము అను అరుస్తోత్ర ములు కూర్చబడినవి. శ్రీ వెంకటేశ్వరకరావలంబ స్తోత్రము మాత్రము వీరి స్వతంత్ర రచనయని తెలియుచున్నది.

**భోగినీలాస్యము ;**

ఇది పోతన చరిత్రము నుండి గ్రహించబడి నది. భోగినీనృత్య ఘట్టమునకు వ్యాఖ్యానము వ్రాసి ప్రచురించబడినది. యువభారతి దీనిని 1974న ప్రచురించినది. ఇందులో ఎనుబది పద్యములున్నవి.

**వైశాలినీ ;**

ఇది పౌరాణిక మహానాటకము. కథా వస్తువు మార్కండేయ పురాణంలోనున్నది కరంధముని పుత్రుడు అలీక్షితుడు విశాల రాజ పుత్రిక వైశాలిని. అలీక్షితుడు వైశాలినిని వివాహమాడి మరుత్తును గనెను. ఇది కథా వస్తువు.

ఇందులో తొమ్మిది అంకములున్నవి. పౌరా ణిక వృత్తాంతమును ఆధునిక జీవితమునకు ప్రతి బింబంగా మలచి వినూత్న ప్రయోగము చేశారు ఇందులో 221 పుటలున్నవి మరియు 259 పద్య ములున్నవి. 1975లో ఇది పచురింపబడినది. ఈ నాటకరచన వలన కవిగారు 'అభినవ కాళిదాసు' బిరుదాంచితులైరి. ఇది వారిధర్మపత్ని వైదేహి గార్కి అంకితమీయబడినది.

**గీతరామాయణము :**

శ్రీ గజాననదిగంబర మాడ్గూళకర్‌గారు మహారాష్ట్రి భాషలో గీతరామాయణము రచించిరి. వీరుదానికి అనువాదము చేసిరి. ఇందులో 56 గీత ములు కలవు. ఇది 1975లో ప్రచురించబడినది.

**శ్రీ హనుమాన్ చాలీసా ;**

హిందీ నుండి దీనిని అనువాదము చేశారు.

**కూలిపోయే బొమ్మ ;**

ఇది వచన కవితాసంపుటి. ఇందులో 34కవిత లున్నవి ఈ కావ్యము 1977లో ప్రచురింపబడినది.

**సూక్తి వైజయంతి ;**

1978లో ప్రచురింపబడినది. ఇందులో 680 పద్యములున్నవి ఇందులో ప్రధానంగా రెండు భాగములున్నవి. ఆటవెలదులు తేటగీతులు మరియు కందములతో వ్రాయబడినది. సంస్కృత పద్ధతి అనుసరించబడినది.

ఈవిధంగా 14 పుస్తకములు ప్రచురింప బడినవి.

**స్తవరాజ పంచశతి ;-**

ఇందులో అయిదు శతకములున్నవి 1) శ్రీ వెంకటేశ్వర స్తవరాజము 2) శ్రీరామ స్తవ రాజము 3) శ్రీనృసింహ స్తవరాజము 4) శ్రీవాగీ శ్వరీ స్తవరాజము 5) శ్రీమల్లికార్జున స్తవరాజము తిరుపతి, బద్రాచలరాముడు, సింహాచలము, వాసర మరియు శ్రీశైలముల దేవతల గురించి చేసిన వినతులివి. తిరుపతి దేవాలయము వారి సహకా రముతో దీనిని ప్రచురించిరి.

**అముద్రితములు:-**

**ఖండకావ్యములు ;-**

వీరు ఎన్నియో కవితలు రచించిరి. అప్పు డప్పుడు రచించిన కవితలను కొన్ని సంపుటాలుగా ప్రచురింపవచ్చును.

**గేయకవితలు ;-**

'స్వాతంత్ర్యరథము' అను పేరుతో అనేక గేయకవితలు రచించిరి.

**నాటికలు ;-**

దోమకొండలోని జనతా కళాశాలలో నున్నప్పుడు వీటిని రచించి విద్యార్థులచేత ప్రదర్శింప జేసిరి. 1) రాజర్షి 2) సత్యమేవజయతే 3) నాగార్జునసాగరము 4) జానపదభారతము 5) గ్రామసుధార్ 6) స్వతంత్రభారతము 7) ఆజాద్ గోవా 8) సంక్రాంతి 9) పగడిదొంగలు 10) స్నేహశక్తి 11) ఎవడుపెద్ద.

**నృత్యనాటికలు ;-**

వీటిని గూడ దోమకొండలో నున్నప్పుడు రచించిరి.

1) రైతురాజు, 2) వయోజన విద్య, 3) పెద్దల చదువు, 4) స్వాతంత్ర్య జ్యోతి.

**ఆకాశవాణి నాటికలు ;**

ఆకాశవాణి విజ్ఞప్తిపై నాటికలు వ్రాసిరి. 1)మోహినీభస్మాసుర 2) మహిషాసురమర్ధనీ 3) పోతన

**మానవులంతా మనవాళ్ళే ;-**

ఇది నవల.

**బుర్ర కథలు ;**

1 రైతుబిడ్డ 2. బుద్ధ చరిత్రము 3. ప్రజాసేవ 4. ఎవడురాజు 5. మనదేశయం 6. చైనా యుద్ధం 7. సమాజ సుధార్ (దీనిని హిందీలో వ్రాసిరి).

**హరికథలు ;**

1 భవమానసరక్తి 2. తులసీ రామాయణము

**దాగుడు మూతలు ;**

తన 15వ ఏట కవితాభ్యాసమునకై 400 చరణముల తేటగీతి మాలికను రచించిరి. బాల కృష్ణుడు గోపికలతో ఆడిన దాగుడుమూతలు వేదాంతార్థము వచ్చునట్లు సరళముగా రచించిరి.

**మాతృదేవుడు ;**

ఇది ద్విపదమాలిక. దేశభక్తి ప్రబోధాత్మక రచన.

**వ్యాసవాణి :**

అప్పుడప్పుడు వారు వ్రాసిన వ్యాసములు రెండు సంపుటములుగా సేకరించి ఉంచినారు.

**భాగవత వ్యాసములు ;**

శ్రీ మహాభాగవతమునకు సంబంధించిమూడు వ్యాసములు రచించిరి. 1) భాగవతములో భక్తి ప్రాధాన్యము-నవవిధ భక్తివిధానములలో శ్రవణ భక్తిప్రాధాన్యము 2) పోతనగారి భాగవతరచనా విధానము. 3) గోపికల మధురభక్తి.

**శ్రీమార్కండేయసుప్రభాతము**

కోరుట్లలో శ్రీమార్కండేయ దేవాలయము కలదు. అది ఆ దేవుని గురించి వ్రాసిన ఆంధ్ర సుప్రభాతము. దీనిని 1972లో వ్రాసిరి. 21 తేట గీతులలో నున్నది.

**గీతములు**

వీరు ఏబదివరకు గీతములు తెలుగులో వ్రాసిరి.

**శాకీర్ గీతాంజలి**

ఇది అనువాదగ్రంథము. చెన్నూరు ఉన్నత పాఠశాలలో పనిచేయుచున్నప్పుడు 'శాకీర్' అను వారు ప్రధానోపాధ్యాయులుగా వచ్చిరి. వారి కవితలను శాకిర్ గీతాంజలిగా అనువదించిరి.

తులు

1) అలంకారశాస్త్రము :- పద్యములలో వ్రాయబడిన అలంకారశాస్త్రము

2) గీతోపన్యాసములు :- ఇందులో భగవద్గీతా ప్రశస్తిని తెలుపు ఉపన్యాసము లున్నవి.

3) దేశభక్తి :-

ద్విపదలో వ్రాయబడిన లఘుకృతి

4) నరహరి నరసింహారెడ్డి జీవితచరిత్ర :-

వీరు వరదాచార్యులవారి పోషకులు, భీమవరము జమీందారు. ఇది వారి చరిత్ర.

5) పోతన :-

ఇది గద్యములో వ్రాయబడిన బాల సాహిత్య గ్రంథము 'తుపాకిరాముడు' 'కోయదొర' వంటి ఏకపాత్రాభినయములు వ్రాశారు. 'బాధ కంటే బోధమేలు', 'గొల్లసుద్దులు' ప్రహసనములు వ్రాశారు. పాఠ్యగ్రంథములు వ్రాశారు.

## ఉదాహరణ సహితముగా వివరణ:-

మణిమాల :-

ఇందులో 59 కవితలున్నవి. మొదటి కవిత కృతిపతిని గురించి వ్రాసినది. మరొక కవిత 'కలను గన్పడునట్టి నా కన్నతండ్రి' యన్నది. దీనిని వీరి రెండవ యన్న లక్ష్మణాచార్యులు వ్రాసిరి. మిగిలిన 56 కవితలు వీరు వ్రాసినవి తర్వాత వ్రాయబడిన కవిత 'సమరకాళిక' రెండవ ప్రపంచ యుద్ధ వాతావరణాన్ని గురించి వ్రాశారు. 'కర్మచంద్రుడు-గంధి' రాటము, హిందూ మహమ్మదీయ సఖ్యము,'రాటపురోద', హరిజనుడు-మాలపల్లె 'జన్మభూమి' శ్రీకృష్ణ దేవరాయాంధ్ర గ్రంథాలయము, ఆంధ్రప్రశస్తి, నిజామురాష్ట్రపు 'బీద వెట్టివాడు', 'వితంతుబాలిక', 'శ్రీరాముడు' 'కుచ వృద్ధుడు' మొదలైనవి.

జర్మనీ మొదలైన దేశాలు రెండవ మహా ప్రపంచ యుద్ధంలో పెట్టే కష్టాలు కామ దేవతా వీరవిహారము, జాతి దురహంకారులగు హిట్లర్ ముసోలిన్ యొక్క దురంత దుర్దాంత రక్త దాహమును చూచినట్లు వర్ణించారు.

'జర్మనీబాధలుడుగంటి చనెడు గాక!
మన ప్రభుత్వమ్ము తలయెత్తిమనెడుగాక
మహిని సమరకాళిక పేరు మాయుగాక
శాంతి భద్రతల్ పనుతః విశ్వంబునందు'.

సమరకాళిక.

'సమ్మతము' అను శీర్షికతో రచించిన కవితలో మత సౌహార్ద్రము ప్రబోధించబడినది. జనార్దనాచారమగు సకల మత పరమార్థసారము బోధింపబడినది. కులమత, జాతివిద్వేష, భాషా విభేదాలు కల్పించుకొని దైవ స్వరూపులైన మానవులను నానావిధములుగా హింసించుచు, పరిహసించుచు, పరితప్తులజేయుచు, మందిరాలలో మసీదులలో, పూజలు నమాజులు చేయు మానవులకు సమర పూర్వకంగా, స్నేహ పూర్వకంగా హిత బోధ గావించిరి.

నిర్మలమ్మగు మనసె నిఖిలేశు మందిరము.
నిష్కామకర్మమ్మె నిరతిపూజాకరము.
కల్లరెఱుగని నోరు మంటా నినాదమ్ము.
కలుష మెరుగని ప్రేమ తళిహ ప్రసాదమ్మె.

ఇంత చక్కగా ఒక్క ఋషి మాత్రమే చెప్పగలడు.

'సత్యతృప్తి జనించు నవ్వులే ఆ
సత్యరూపార్చనకు పువ్వులు'

ఎవని హృదయంలో హిమాలయాలు పులకింపవో, ఎవ్వనిమనస్సు మల్లెల సుగంధ భరితమో, ఎవని ఆలోచనా శిఖరము హిమనగమో, ఎవని జీవనము అనంత పవనప్రవాహమో, ఎవని యువవని అమ్లానపుష్ప సమమో, ఎవని తత్త్వము దైవత్వమో, ఎవని వ్యక్తిత్వము గంభీరఅవతారమో, ఎవని సత్య స్వరూపమో వాడే యింతటి సత్యమును పవిత్రపరంగా చెప్పగలడు. ఆట్టి తత్త్వమును అందరము కొన్న వరపన్న జాతికెవరడుడు.

15-12-1950 నాడు వల్లభాయి పటేలు మరణించిన సందర్భములో వల్లభభాయి స్మృతియను కవితను వ్రాశాడు.

'అడనుకు సృష్టి చేసి యిడెనా భగవానుడు
నిన్ను మాకు, మా
చెదరిన యిల్లు చక్కబడజేసి ప్రపంచము
తీర్చిదిద్ద న
య్మది తుపముట్టకుండ మృతినందిత వీవు
మహాత్ము హత్యచే
కదలిన పుండు గుండియల కారము జల్లెను
నీవియోగముల్.
'తావకీన సుచిష్ట చరిత్ర సువర్ణ పంక్తులన్
భారత భారతి ప్రసిద్ధగతి వ్రాసికొను'. సనియు
"భారతజాతి నీ యడుగుదోయికి నెల్ల వేళల
దోసిలియొగ్గు' ననియు కృతజ్ఞతతో స్మరించినారు.

## ఆహ్వానము

'ఆహ్వానము' తమ గురువుగారైన కీ.శే. కాళోజీ రంగారావు గారి వారి సతీమణీ కీ.శే. కాళోజీ రామాబాయమ్మగారిక్కి అంకితమొనర్చిరి. వీరు కాళోజీ సోదరుల జననీజనకులు. ఈ పుస్తకమునకు 'ఆహ్వాన'మని నామకరణవాడుటకు కారణము ఇందులో ఆహ్వానమనే కవితయున్నది. అందులో యిలా ప్రబోధించారు.

'జాతిమతాతీలమై నీతినియమ సహితులమై వసుధైక కుటుంబముగా వసింతము రండోయీ' యనియు 'యుద్ధభయము చంపివేయు బుద్ధుల విక సింపజేయు సిద్ధార్థుల మహాత్ముల నుసిద్ధము చేయుదము రండనియు ఆహ్వానమందించారు

## "జయధ్వజం"

ఇది జాతీయగీతముల సంకలనము. ఈసంపుటిలో మొత్తము దేశభక్తి కవితలు కలవు. 1965లో పాకిస్తాన్ భారతదేశముపై దండెత్తినప్పుడు వ్రాసిన కవితలివి.

'రక్తపిపాసాప్రదీప్త రాగవర్ణ విస్ఫారిత
కరాళకాళముఖాగ్ని గహ్వర జహ్వాజ్వాలలు
సరోషనిశ్వసనానిల సారిత భీషణ కీలలు
సరిహద్దుల కబళించెడి శత్రుప్రమహోరణ్యమ్ముల
విరిగి తలలనెత్తని గతిప్రేచెలగ జ్యామ్ముల-
'జయంమనదే'

మరొకచోట

చిటపట చిటపట చిట్లుచు సెగలపొగల వెలి
గ్రక్కుచు
నిటాలనేత్రాగ్నులుదిక్తటాంచలమ్ముల గ్రసింప
కుటిలభ్రూకుటినటింప......
జటాజూటములు విడివడి చెరేల్ పెరేలని
యాడగ
పశ్చిమరక్తాంబరమున ప్రళయ తాండవము
సల్పుచు
జటిత ధూర్జటి హిమగిరితటి రౌద్రార్భటి
దూకెను. "జయం మనదే'
'మా దేశం'లో మనదేశము యొక్క లక్ష్యాన్ని
స్పష్టంగా వివరించారు.

పరదేశీయులు తొలగండీ యీ భారతదేశము
మా దేశం
వినండి వినండి విశ్వ ప్రజలూ వీర భారత
సందేశం

ఘట్టోను మండలించి నిందించిన విధానము
పరికించండి.

ఆడ్డాల పుట్టో వాదితిమోసమ్ములగుట్టో
అధర్మాలకాటపట్టో జులైకారలెట్టో.

సంవాదకులు

మరవారములెన్నియైన మానవతావాదమొకటే
మర మనుసెవి పూతరంగు మానవతయే
పుట్టురంగు.

## పోతన చరిత్రము

ఇది వానమామలై వరదాచార్యులవారి మహా కావ్యము ఇది ద్వాదశాశ్వాసవిలసితమై శ్రీరామ చంద్ర పదసరోజసమర్పితమై యున్నది. మొదటి పది అశ్వాసములలో పోతన చరిత్రము వర్ణితమై యున్నది. రెండాశ్వాసములు కావ్యానుబంధముగా కూర్చబడి యున్నవి. అందు రామచరిత్రము, నరసింహావతారకథ, గజేంద్రమోక్షము, రుక్మిణీ కళ్యాణము. కథలు మహోత్కృష్టముగా వర్ణించ బడినవి. భోగినీనృత్యఘట్టము అపూర్వసాహిత్య సృష్టి.

వరదాచార్యులుగారు తమ పోతన చరిత్ర మును శ్రీరామచంద్రునకు భక్తితో అంకితము చేసినారు కావ్యారంభములో ఇలా ఉన్నది.

సొమ్ముల యాసలోబడక క్షుద్రనృపాలుర
నీసడించి చొ
క్కమ్మగు భక్తిభాగవత కావ్యరమన్ గృతి
నిచ్చెసీకు శ్రీ
బమ్మెరపోతరాజత నిభవ్య చరిత్రమునే మహా
ప్రబం
ధమ్మనొనర్చి నిన్నుకృతనాథునిగా నొన
రించిచెప్పెదన్.

## భోగినీ నృత్యఘట్టము

ఇది చతుర్థాశ్వాసమున 230వ పద్యమునుండి 309 వ పద్యము వరకు 80 పద్యములలో వర్ణించ బడినది రాచకొండలో ఒక వేశ్యా పుత్రిక కలదు. ఆమె రూపగుణ శీల విద్యా వివేక సంపన్నురాలు, లలిత కళా స్వరూపిణి. ఆమె సింగభూపాలుని చేపట్టదలచినది. ఒకరోజు తల్లితో గూడి రాజసభ కేగి నృత్యము చేసి రాజును ఆకట్టుకొన్నది. ఆతని చేత స్వీకరింపబడినది. ఆమె భోగినిగా వ్యవహరిం పబడినది

జాలవిడు బొంగరము లీల గిఱ్ఱున తిరుగు
బూల బంతింబోలె దేలాడు నొక పరుగు
లాలించు పూల యూయెల చేరుల లాగు
సొరి ముందును వెనుక కొయ్యారముగ దూకు
నటునిటున్ విసరు ముత్యాల వీవన బోలి
యమునోలి యిటుల్రవాలి యందాల నడదేలి
యల డోలికల దేలు కలహంస గతినేలి
మంక లగునాగు కోమలి సొంపు నడల్రగాలి
తికధిమిత తకఝుణత తకఝుంత
ఝంతరిత
తకటజతి ప్రకటగతి నొకపొకటి జతపరచి
ఆటపాటలలోన సందచందము నించి
యలరించి సభను నాడించి పాడించి
మురిపించి మఱపించి కరగించి కదలించి
ముదమునిచ్చుచునట్టె నిదురబుచ్చుచు మించి
లాలనూపెడి శివలాస్యమ్ములను బోలి
బాలకృష్ణునిలీల శౌరి తాండవహేల

నవ్యమోహిని వోలె నాట్యముం దలపించె
భవ్యభారతి వోలె భరతమ్ము గానరించె.

పెనుగాలితో కురిసిన వర్షమును వర్ణించిన తీరు అపూర్వం.

గిరిశిఖరము వోలె వారలి పడునో కరులు
ఘీంకృతి గలిపెడునో
ఢణఢణంఢణఢాం ఢంఢణ డడడ డడడ
ఢాంఢ ఢమ్మని
గర్భనిర్భేదముగ నుఱుములు నార్భటింపగ
నవని చెవుడుపడె
రివ్వురు రివ్వుమ రిరివ్వురు రివ్ రివ్ రివ్ రిరివ్
రిరివ్ మను
వాయుదేవుని ప్రళయతాండవ వైభవముంకు
శివము దూలుచు
ఛరర రరరర చట్టుమనుచును దరుల
శాఖలు ధరణి కూలగ

— — —

రింజ రింజరి రింజరి రిరిం రింజరింజరి
ఝం ఝఝం అని
తెరపి నీయక చఱచికొట్టుచు కరకసంహతి
విరచిపెట్టుచు

వర్షము వెలిసిన తరువాత కొన్ని ధ్వనుల ననుకరించుచు వ్రాసిన పద్యములు చాల విచిత్రముగా నున్నవి.

పోతన చరిత్రమున 3787 పద్యగద్యములు గలవు.

895 ఉత్పలమాలలు, 376 చంపకమాలలు, 124 శార్దూలవిక్రీడితములు, 150 మత్తేభవిక్రీడితములు, 872 కందములు, 375 సీసములు, 746 తేటగీతములు, 302 ఆటవెలదులు, 38 విశేషవృత్తములు. గేయములు, 207 గద్యములు

## విప్రలబ్ధ

ఇది వారు రచించిన మరొక గేయ కావ్యము

దివ్యమైన లక్ష్యంతో తపనతో, అన్వేషణా దృక్పథంతో ప్రయాణించిన సాహితీ పథికుడు వానమామలై.

---

శ్రీ అందె వెంకటరాజంగారి మరియు తదితర రచయితల పుస్తకములెన్నో తోడ్పడినవి. వారికి నా కృతజ్ఞతలు.

ఆర్ట్స్ అండ్ సైన్సు కాలేజి
కాకతీయ యూనివర్సిటి, వరంగల్-506010

---

ది. 1-9-90 నుండి ప్రారంభిక పరీక్షల మధ్యమ చూటు శుల్కము మరియు అంకగణిత శుల్కము లలో ఈ క్రింది విధముగా మార్పులు జరిగినవి. విద్యార్థులు, ప్రచారకులు గమనించ ప్రార్థన.

1. అంకగణిత శుల్కము రూ॥ 5-00 లు
2. మధ్యమ నుంచి చూట్ శుల్కము రూ॥ 4-00 లు 18.00

కార్యదర్శి

# జాషువాకు కీర్తిపతాకంగా నిలిచిన మేటి విషాద కావ్యం 'పిరదౌసి'

— సౌభాగ్య కామేశ్వరి

శ్రీ జాషువా గారి కృతులలో ప్రఖ్యాతి గన్న 'పిరదౌసి' కావ్యం ఆకృతిలో చిన్నదైనా భావ గుంఫితమై పాఠకుల హృదయాన్ని స్పందింప చేస్తుంది. నాలుగు ఆశ్వాసాలతో సుమారు అరవై ఆరు పద్యాలతో ఉన్న పిరదౌసి కావ్యంలో పిరదౌసి జీవిత విశేషాలతోపాటు జాషువాగారి హృదయాంతర్గత భావాలన్నీ ప్రతిబింబిస్తున్నాయి.

ఈ కావ్యంలో కథావస్తువు ఆఫ్ఘన్ రాజైన గజనీ మహమ్మద్‌కూ, పిరదౌసి కవికీ మధ్య జరిగిన యథార్థగాథ. దిగ్విజయానంతరం తన రాజవంశచరిత్రను వ్రాయించుకోవాలని సంకల్పించాడు ఆనాటి పారసీక కవులలో మేటివాడైన పిరదౌసిని ఆహ్వానించి తనకోరిక తెలియజేశాడు. పద్యానికొక బంగారు దీనారం బహుమతిగా ప్రకటించి ప్రోత్సహించాడు ముఫైయ్ సంవత్సరాల నిరంతర కవితాయజ్ఞానంతరం మేటికావ్యం 'షానామా' రచన పూర్తయింది. అరవైవేల పద్యాలు అనర్ఘరత్నాలవలె రచించబడ్డాయి. కాని సుల్తాను మనస్సు మారింది. బంగారునాణాలకు బదులుగా వెండి నాణాలు పంపించాడు. ఈ అవమానానికి కవి మనస్సు దుస్సహవేదన పొందింది. తన బాధను వివరిస్తూ పద్యాలు వ్రాసి పంపుతూ వెండి నాణాలను వెనక్కి త్రిప్పి పంపాడు. ఆగ్రహంతో సుల్తాను కవిని వధించమని భటులను పంపాడు. సమాచారం గ్రహించిన పిరదౌసి రహస్యంగా కుటుంబసమేతంగా దేశంవదలి తరలి పోయాడు.

ఆ తర్వాత కొంత కాలానికి సుల్తాను శాంతించి, తనకు మహోపకారంచేసిన పిరదౌసికి తాను అపకారం చేసినట్లు గ్రహించాడు. మశీదు గోడపై పిరదౌసి వ్రాసిన అశ్రుపూరితమైన కవితను చూచి పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. వెంటనే అరవైవేల బంగారు నాణాలను కవికి పంపించాడు. కాని దైవఘటన వలన ఆ సొమ్ము పంపిన నాటికే పిరదౌసి స్వర్గస్థుడయ్యాడు. కవి కుమార్తె అభిమానధనురాలు. దుఃఖంతో ఆ సొమ్మును వెనక్కి త్రిప్పికొట్టింది. సుల్తాను ఆ ధనంతో కవి పేర ఒకసత్రం నిర్మించాడు. పశ్చాత్తాపంతో, దుఃఖంతో కృంగిపోయిన సుల్తాను ఆత్మ ఈనాటికీ అర్ధరాత్రులలో పురవీధులలో పరిభ్రమిస్తూందని జనవాక్యమట. ఇది సంగ్రహంగా పిరదౌసి కథావస్తువు.

ప్రథమ చతుర్థాశ్వాసాలలో కథాగమనం ఉంది. ద్వితీయాశ్వాసం కవి జాషువాగారి ఆధ్యా

త్మిక చింతనకు ప్రతిబింబంకాగా తృతీయాశ్వాసం లో అటవీ వర్ణన చేయబడింది.

ప్రథమాశ్వాసంలో సుల్తానైన గజనీ నోట జాషువా తన భావాలను ప్రకటించారు.

'కవిని గన్నతల్లి గర్భంబు ధన్యంబు
కృతిని చెందువాడు మృతుడుగాడు...'

అంటూ కవిని ప్రశంశిస్తూ,

'పెరుగు దోటకూర విఖ్యాత పురుషులు
కవిని వ్యర్థజీవిగా తలంత్రు'

అని కవి విరోధులను విమర్శించారు.

కవియొక్క మహత్తర శక్తిని కీర్తిస్తూ,

'క్షణము గడచినదాని వెనుకకు మరల్ప
సాధ్యమే మానవునకిలాచక్రమందు?'

అనిప్రశ్నించి

'దాటిపోయిన యుగములనాటి చరిత
మరల పుట్టింపయతడె సమర్థుడగును.'

అని కవిని ప్రస్తుతించారు.

కవి తన ఊహా జగత్తులోనే ప్రపంచాన్ని దర్శించ గలడు. రచనలోనే తాదాత్మ్యం చెంది, వివిధపాత్రలను పోషిస్తాడు. ఎందుచేతనంటే :-

'సున్నితంబగు కవి మనస్సున వసించు
కల్పనాశక్తి బహువిధ గతుల మెరయు'

అందువలన కవి

'వసుధ శాసింపగల సార్వభౌముడగును
ధీరుడగు భిక్షుకుండగు దీనుడగును
దుఃఖితుండగు నిత్యసంతోషియగును
సత్కవి ధరింపరాని వేషములు గలవె?'

జాషువాగారి రచన అఫ్ఘనస్‌రాజు గురించే అయినా భారతీయ సంప్రదాయాలను కావ్యరచనలో చొప్పించారు. ఒక ఉదాహరణ :

'పిరదౌసి నామకవినాహ్వానించి యొడ్డోలగం బున నుద్గ్రంథము సేతకై యొసగె కర్పూరంపు తాంబూలమున్' అంటూ గజనీచేత పిరదౌసికి కర్పూర తాంబూలమిప్పించారు జాషువా.

అల్లే

'తమ్మిచూలి కేలుదమ్మిన కలనేర్పు
కవి కలంబునందు కలదు కాన...'

అన్నప్పుడు 'తమ్మిచూలి (తామరపువ్వు నుండి పుట్టినవాడు,విష్ణుగర్భసంజాతుడైన బ్రహ్మ) గోచరిస్తాడు కానీ అల్లా గుర్తుకురాడు.

పిరదౌసి కన్న కలతూ భవిష్యత్తుకూ గల సంబంధాన్ని నమ్ముతూ, అతీంద్రియశక్తులను నమ్ముతున్నారు.

'నరుల సుఖదుఃఖముల ముందునడచి వచ్చు
నీడలే స్వప్నములు సుమ్ము నిశ్చయముగ
కాలచక్రంబు గంభీర గమనమందు
దాగికొని యెన్నియెన్ని చిత్రములుగలవొ'

ద్వితీయాశ్వాసంలో జాషువా ఈశ్వరతత్వాన్ని విశ్లేషించారు. ఆయన ఆధ్యాత్మిక భావపరంపరకు తార్కాణమే ఈ ఆశ్వాసం అని చెప్పవచ్చు. ఈ ఆశ్వాసంలో పిరదౌసి కవి అటవీమార్గంలో సతీ సుత సమేతంగా ప్రయాణం చేస్తున్నాడు. ఆ దుర్గమారణ్యంలో పయనిస్తూ పరమాత్మని మన సారా ప్రస్తుతించాడు. ఆ స్తుతిలో కొన్ని మోహన పద్య పంక్తులను పరిశీలిద్దాం.

'విత్తనంబున మహావృక్షంబు నిమిడించి
సృష్టించి గారడీ సేయువాడ

కడుపులో శిశువును గల్పించి పదినెలల్
మోయించి యూపిరిపోయువాడ
సద్భక్త వరులకు సాక్షాత్కరించియు
ఉన్నచో టెరిగింపకున్నవాడ
తోటమరింపకమున్నె పుష్పసంతతులకు
వింతగా రంగులు వేయువాడ...'

ఇట్టి మనోహరసృష్టిని భగవంతుడు మానవులకు ప్రసాదించి అనుభవింపుడని ఆనతిచ్చాడట. సృష్టిలోని వింతలు గమనించి తన్మయులు కావటం భావుకత. పరిశీలించుట విజ్ఞానం. ఈ అద్భుతములన్నిటికీ ఒక కర్త ఉన్నాడని భావించి, అతడే మన స్వామి అనో, తండ్రిగానో, ప్రభువుగానో భావించుట ఆధ్యాత్మికత. అన్ని మతాలూ, దివ్యజ్ఞాన, బ్రహ్మజ్ఞాన, సమాజంవంటి మతాలు కూడా ఈశ్వరుని అద్భుత గుణాలను ప్రస్తుతించాయి. అందువల్లనే జాషువా అంటారు.—

చెలువమొప్ప పుడమి సృష్టించి మాకిచ్చి
అనుభవింపుడనుచు ఆనతిచ్చిన'
వాడు ఆ సర్వాంతర్యామియేనని.

ప్రకృతిలో పరమేశ్వర దర్శనాన్ని, మానవాతీత శక్తిని గురించిన అన్వేషణను, ప్రకృతి ప్రవృత్తులలో తన ఊహామూర్తిని దర్శించుట మొదలైన పద్ధతులు జాషువా కావ్యంలో కోకొల్లలు.

'సంజకెంజాయలో జలకంబు నవరించి
పరతెంచు సూర్యబింబమ్ములోన
పదునారు దినముల పరువు వచ్చిననాటి
చంద్రుని ధవళ హాసములలోన—
పరమేశ్వరుడు వ్యాపించియున్నాడు.

అంతేకాదు 'మొలక తెమ్మెరలలో, సింగిలోన పరువులెత్తె మెరపుగర్భాలలో, గాలికి దూగియాడు గిజిగాని కులాయములో, ఫేన పంక్తుల నునావిలాసములో ఈశ్వర దర్శనం చేశారు కవి. భగవంతుడు ప్రకృతి విచిత్రములలో 'హాయిగా పవ్వళించి, బ్రహ్మాండములను పల్కరించుచునున్న దివ్యస్వరూపు'డట.

ఇంతేకాదు :

'ప్రకృతి పదార్థజాలములపై నుదయాస్తమ
యంబు లందున్
యకలుషపాణి పద్మము రహస్యముగా లిఖి
యించి పోవుటా
క్కొక సమయాన......

కనుగొంటున్నారు కవి. ఇలాగే మరొకచోట భగవంతుడు రాత్రంతా తనకు తోడై మేలుకువుగా ఉన్నాడని అంటూ, ఆ ఎరుపును చిగురుటాకుల వన్నెగా పోల్చి, ఆ ఎరుపే సూర్యోదయవేళనాటి కెంజాయలనుటలో కవి ఊహాశక్తి ఎంత మృదువైనదో, మనోహరమైనదో స్పష్టమౌతోంది.

కొన్నిచోట్ల సఖ్యభావంతోనూ, కొన్నిచోట్ల దాస్యభావంతోనూ పరమేశ్వరుని పట్ల తన విధేయతనూ, భక్తినీ ప్రకటించారు.

జాషువా తనకవిత్వంలో స్పష్టంగా ఏమతాన్నీ, ఏదేశాన్నీ పేర్కొనకుండా ప్రపంచమంతటా నిండిన సర్వాంతర్యామిని అడుగడుగునా దర్శించారు.

'భూతపంచకమున మున్గితేలుచునున్న
నీ యనంత శక్తి నిశ్చయముగ
నాకు పట్టుకొమ్మ నా వజ్రకవచమ్ము
సిలుగులేమిచేయగలవు నన్ను?'

అని నమ్మారు.

'హృదయమును జీల్చి పూజలర్పించుకొందు' ననీ 'గుండెలు గ్రుమ్మరించెద'నని చెప్పగల దిట్ట

జాషువా. 'ఈ భూములు నిల్చునా భువనమోహన, నీవు పరాక్రమించినన్' అని వేడుకొంటూనే 'నీ కవన పద్భుత మర్ధగభీరమీశ్వరా' అని ఆ సర్వ శక్తిమంతుని కూడా సాటికవిని చేశారు.

ద్వితీయాశ్వాసంలో ప్రకృతిని వర్ణిస్తూ పర మేశ్వర ధ్యానంచేసిన కవి తృతీయాశ్వాసంలో అటవీవర్ణన చేశారు.

'దెసలు బీటలువార వసపట్టి పోరాడు
కొదమ సింగములకు బెదరిపడుచు
త్రాటి తోపుల కల్లు త్రావు భల్లూకముల
గుటగుట ధ్వనులకు గుదులుకొనుచు
నూహింపరాని ఏవో మ్రుక్కిడి మృగాల
వెర్రికూతలకు తబ్బిబ్బుపడుచు
కొరవి దయ్యముల టక్కరి దివ్వియల జూచె
యూరు దగ్గరెనంచు నూరలిడుచు
గొసరినవ్వరి ధాన్యంబు గొరకి నములు
నెలుక మునిపంటి సవ్వడికులికి పడుచు
త్రోవగమియించునాటి పాంథులనదేమొ
అదరి బెదరించె నొకయెండుటాకు కూడ

ఆ భయంకరమైన అడవిలో వారికి నిషాదు డొకడు దారి చూపిస్తాడు 'పిడి యేనుగు పిండులు చేకుమూగినులను కూకటివేళ్ళతో బెరకి కూల్చుట, కొండలకావల, ఈవల చెంచులగూడెములు, తాండ్ర తోపుల కొండచిల్వలు, శ్మశాన దుర్గంధములుదాటగా దొరగా పండి గుత్తులైన మేలిఖర్జూరపు తోటలు, ఒంటెలను మేపే హారసీకపౌరులు ద్రాక్షఫలాలు పక్వంకాగా వచ్చే సువాసనలు, ముత్యాలవర్తకాల గుడారాలు కన్పిస్తాయని చెబుతూ

'ఈ యేడ్దార్లగండుటిసుక తిప్పెలమీద
వెట్టచేత బిగిలి పిల్లలయిన
నిప్పుకోడిగ్రుడ్లు నీటికుండలువారి
కొంటెపాడి వారి కుగ్గుపాలు.

ఈవిధంగా తృతీయాశ్వాసమంతటా భౌగో ళిక జ్ఞానం ఇమిడి ఉంది.

చతుర్థాశ్వాసమంతటా కథాగమనం ఉంది. పిరదౌసి గురించి సామంతభూపాలురు వ్రాసిన సామోక్తులు ప్రభువు పశ్చాత్తాపము వర్ణించబడ్డాయి. గజనీహృదయం కరిగింది. చరిత్ర ప్రకారం కూడా గజనీ కళాప్రియుడు. రాజ్యవిస్తరణ కాంక్షతోగాక సౌభాగ్యవంతమైన భారతదేశంలోని ధనరాసులను కొల్లగొట్టడమే అతని దండయాత్రలకు కారణమని తెలుస్తోంది. పసిడి దీనారాలకు బదులుగా వెండి నాణేలను పంపి అధికారమదాన్నీ లోభాన్నీ ప్రద ర్శించినాగాని 'పిరదౌసీ కవి వాక్కునంగల రసా విర్భూతి' గ్రహించినవాడు. 'కవుల కలకంఠ కుహూ కుహూకారమధుర భావగుంభిత కవితలకు' తల యూచినవాడు. దురదృష్టమేమిటోగాని పిరదౌసికవి పట్ల దారుణమైన అన్యాయం చేశాడు. అందువలననే పిరదౌసి మసీదు గోడపై వ్రాసిన కవిత్వంలో

'ముత్యములకిక్కయైన సముద్రమునను
పెక్కుమారులు మున్కలు వేసినాడ
భాగ్యహీనుడ ముత్యంబు బడయనైతి
వనధి నను మ్రింగ నోరువిచ్చినది తుదకు'

అని వాపోయాడు

సుల్తాను పశ్చాత్తాపంతో సొమ్ము పంపిన సమ యం ఎటువంటిదోగాని సుకవి దేహం ప్రేతభూమికి చేరగా శూన్యగేహానికి సొమ్ము చేరింది

'నిమిషభేదంబు నడమ సంధింపబడిన
ఈ రహస్యంబు కనుగొన నెవరితరము?

ఏది ఏమయితేనేమి 'అల మహమ్మదుగారికి నపశయంబు, నిండు సత్కీర్తి కవికిని' నిలచి పోయిన చరిత్ర ఇది

# 'మెరుపుల మరకలు'పై వ్యక్తివాద సిద్ధాంత ప్రభావం

* డా॥ జి. ఉషాలావణ్య

ఆధునిక సాహిత్యంలో మానవ జీవన వికాసానికి ప్రాతిపదికగా వ్యక్తి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల విలువను చాటిచెప్పే వ్యక్తివాదసిద్ధాంతాన్ని ఆధారం చేసుకుని ఎన్నో రచనలు వచ్చాయి. వ్యక్తివాదం వ్యక్తి విలువలకు మాత్రమే ప్రాముఖ్యతను ఇవ్వడం వల్ల వ్యక్తి వికాసానికి అవరోధాలుగా మారే సనాతన సంప్రదాయాలను, ఆచార వ్యవహారాలను ధిక్కరిస్తుంది. సాంఘిక-రాజకీయ ధార్మిక కట్టుడుల నుంచి వ్యక్తికి విముక్తి కలిగించి వ్యక్తి వికాసానికి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చేదే వ్యక్తివాదం. వ్యక్తి తన అవసరాలు సాధించుకునేందుకు సమాజం ఒక సాధనం మాత్రమే. అంటే వ్యక్తి స్వయంగా తన బాగోగులను గుర్తించి, తన జీవన వికాసానికి అవసరమైన నైతిక ... విలువలను నిర్ధారించుకోవలసి వుంటుంది. తన శక్తి సామర్థ్యాలను నిజాయితీగా అంచనా వేసుకుని వాటిని నిలుపుకునేందుకు ప్రయత్నించేవాడే అస్తిత్వవంతుడు అనిపించుకుంటాడు. వ్యక్తి తనలోని ఈ శక్తిని గుర్తించినప్పుడే తన అస్తిత్వం యొక్క సార్థకతను గుర్తించగలుగుతాడు. అయితే అస్తి

జాషువాగారి శైలి మనోజ్ఞమైనది. రసగర్భితము, మృదుమధురము. భాష సరళమైనది అక్కడక్కడ వాడిన ఉర్దూశబ్దాలు 'పసందు పరమానా, పైగంబరు, కాఫరు, లుచ్ఛా, మొదలైనవి. ఆఫ్ఘన్ రాజ చరిత్రలో వాడదగినవే కాబట్టి శైలిని మరింత పరిపుష్టం చేసినవి. కవి ప్రయోగాలలో కొన్ని వర్ణనలు. 'యేలప్రాయపుటింపు విడని మృదు కంఠాత్రి' 'హైందవ దేవతాగర్భములల్ రత్నరకములు చింద', 'కలహములలోన రక్తము చిలుకుచున్న' మొదలైనవి సందర్భోచితమై భావ పరిపుష్టికలవి.

సాంఘిక దురాచారాలు తీవ్రంగా ఉన్న రోజులలో తన ప్రతిభతో రాణించిన కవి జాషువా. సుల్తాను చేసిన అవమానానికి తలవంచని అభిమాన ధనుడు ఫిరదౌసి కవి. కవి మరియొక కవి చరిత్రను వ్రాయగా రసజ్ఞులు మెచ్చిన మేటివిషాద కావ్యం ఫిరదౌసి.

హిందీ
జడ్. పి. పి. హైస్కూల్
జీలుగుమిల్లి-534 456, పశ్చిమగోదావరిజిల్లా(ఆం.ప్ర)

జీవన సార్థకం చేసుకోవాలంటే వ్యక్తికి ముందు వ్యక్తి స్వాతంత్ర్యాలు ఉండాలి ఈభావాన్నే సార్త్ర్ 'నాసియా'లో వ్యక్తం చేస్తాడు—'స్వేచ్ఛ' అనేది ఒకరు యిచ్చేది కాదు, వ్యక్తి తనకు తానుగా తన సహజ స్వభావంతో సంపాదించుకునేది అని అయితే కేవలం తన స్వార్థ పూర్తికి సంతృప్తికే కాకుండా తన యిష్టాయిష్టాలకు అనుభూతులకు అనుగుణంగా జీవిత విలువలను నిర్ధారించుకుని తన అధికారాలకు ఏమాత్రం భంగం కలగకుండానే సమాజశ్రేయస్సుకు పాటుపడటాన్ని వ్యక్తివాదం సమర్థిస్తుంది. దీన్ని ఒక విశిష్టమైన మానసిక ప్రవృత్తియొక్క పరిణామంగా కూడా చెప్పవచ్చు. భావుకుడు, సున్నిత మనస్కుడు అయిన వ్యక్తి నేటి యాంత్రిక జీవన విధానంతో రాజీ పడలేక, తన అభిరుచులకు అనుగుణంగా జీవితాన్ని చక్క దిద్దుకునే చేవలేక ఎన్నో కష్ట నష్టాలకు గురి అవుతున్నాడు. అతడిలోని భావుకత, అతడి ఆశలు-ఆకాంక్షలు కనీస అభివ్యక్తికి కూడా నోచుకోక మనసులోనే ప్రక్షిప్తమై పోవటం వల్ల అతడు అంతర్ముఖుడై బాహ్యజగత్తు నుంచి విడివడిపోయి ఆత్మానందానికి ఎక్కువ ప్రాముఖ్యతను యిస్తూ ఊహాలోకాల్లో విహరించడం మొదలు పెడతాడు. ఈ రకంగా సామాజిక వికాసానికి అవసరమైన బాధ్యతలనుంచి పలాయనం చిత్తగించడమే వ్యక్తివాదమని కొందరి అభిప్రాయమయితే, స్వసుఖానికి అత్యధిక ప్రాముఖ్యతను యిచ్చి సామాజిక మర్యాదలను, కట్టుబాట్లను వుల్లంఘించి తద్వారా అరాజకతను సృష్టించేదే వ్యక్తివాదమని మరి కొందరి విమర్శ. అయితే యివన్నీ అర్ధసత్యాలే.

సాధారణంగా తన చుట్టూవున్న వాతావరణం పట్ల సరి అయిన అవగాహన లేకపోవటం వల్ల తను పాటించవలసిన విధుల పట్లకూడా ఆసక్తి లేకుండా పోయి బాధ్యతారాహిత్యంగా వ్యవహరించి చివాట్లు తింటూ, తనకో గుర్తింపు గౌరవము లేవని వ్యథ చెందేవారు తమ అసమర్థతను ఒప్పుకోలేక ఆత్మన్యూనతను అధిగమించలేక తమను తాము మోస గించుకుంటూ బ్రతుకుతుంటారు. ఈ రకంగా కేవలం తన అవసరాలను అధికారాలను లెక్కించుకునే వ్యక్తి తీరని అసంతృప్తికి లోనవటమే కాకుండా ఎన్నో యితర సమస్యలను సృష్టించుకుని వాటినీ అధిగమించలేని అశక్తతతో లేనిపోని భ్రమలకు భయాలకు లోనవుతాడు. ఇటువంటి వారే సామాజిక అస్తవ్యస్తతకు, అరాజకతకు, కారకులవుతారు. ఈ రకమైన ఆత్మప్రవంచనల నుంచి, అసంతృప్తుల నుంచి విముక్తి కలిగించి వ్యక్తి సత్యాన్ని—అతడి యదార్థ స్వరూపాన్ని అవగతం చేసుకునేందుకు వ్యక్తివాదం వుపకరిస్తుందేగాని లేని సమస్యలను సృష్టించదు,కాబట్టే చలం, బుచ్చిబాబు, గోపీచంద్, వడ్డెర చండీదాసు, సుదర్శనం వంటి వారు ఈ వ్యక్తివాద సిద్ధాంతాన్ని ఆధారం చేసుకుని వ్యక్తి ఆంతరంగిక జీవితాన్ని విశ్లేషించే ప్రయత్నం చేశారు. వీరి రచనలను అర్థం చేసుకోవాలంటే ఫ్రాయిడ్ మనోవిశ్లేషణా సిద్ధాంతాన్ని కూడా తెలుసుకోవడం అవసరం.

ఫ్రాయిడ్ ప్రతిపాదించిన అంతశ్చేతనావాదం ప్రకారం మనిషి మనసులోని చేతన, ఉపచేతన, అవచేతనావస్థలలో వుపచేతనకు ఎక్కువ ప్రాముఖ్యత యివ్వవలసి వుంటుంది. చేతనలో వ్యక్తి పొందే అనుభూతులన్నీ వెంటవెంటనే వుప చేతనకు తరలింపబడతాయి. జీవితం పట్ల అతడి వాస్తవిక దృక్పథము, అతడి నమ్మకాలు-అపనమ్మకాలు, అతడి భావాభిప్రాయాలు అన్నీ ఈ వుపచేతనలోనే ప్రక్షిప్తంగావుండి కాలక్రమంగా వుచిత వాతావరణం

చూసుకుని స్వప్నాల రూపంలోను దివా స్వప్నాల రూపంలోను బహిర్గతం అవుతాయి. అంటే సామాజిక నైతిక కట్టుబాట్లవల్ల చేతనావస్థలో అతడు వ్యక్తపరచలేని భావాలు కోరికలు వుప చేతనలో అణగ దొక్కబడి, కొంతకాలం తర్వాత కలల రూపంలో అభివ్యక్తిని పొందటం వలన అంతవరకు అంతర్గతంగాపొందిన ఆందోళనలనుంచి వత్తిడుల నుంచి విముక్తి పొందుతాడు.

ఫ్రాయిడ్ సబ్లిమేషన్ సిద్ధాంతం ప్రకారం ప్రతి కళాకారుడు వుపచేతనలోని అనుభూతులను తన రచనల్లో అభివ్యక్తం చేసి మానసికంగా అంతవరకు అనుభవించిన వత్తిడుల నుంచి స్వస్థత పొందుతాడు. అంటే సాహిత్య రచనలలో యిం రూపంలో అస్పష్టంగా మిగిలిన భావాలు లక్షణ రూపం వహిస్తుంది కాబట్టి ఆ రచనలను అర్థం చేసుకోవాలంటే వాటి ప్రతీకార్థాలను విశ్లేషించడం అవసరం. గోపీచంద్ తన 'మెరుపుల మరకలు'లో ముఖ్య పాత్రల స్వభావాలను విశ్లేషించేందుకు ఈ స్వప్న సిద్ధాంతాన్నే ఆధారం చేసుకున్నాడు. ఇందులో ముఖ్య పాత్రలు- ఉషారాణి, చక్రవర్తి, రామానుజంల నిజరూపాలను వారి మనోకామనలను వారి కలల విశ్లేషణ ద్వారా అర్థం చేసుకోవచ్చు. మొదటిగా చక్రవర్తి కల- ఈ కల ద్వారా అతడి వాస్తవిక నైజం అర్థం అవుతుంది. అంటే చేతనావస్థలో సాంఘిక నీతి నియమాలను లెక్కచేయక ఉషారాణితో స్నేహం చేసేందుకు వుద్రూతలాగే చక్రవర్తి మనసు వుపచేతనలో సాంఘిక మర్యాదల పట్ల ఉన్న నమ్మకం వల్ల గాని వాటిని ధిక్కరించలేని పిరికితనం వల్ల గాని అంతర్మథనకు గురి అవుతాడు. అయితే కాలాంతరంలో భార్య సహచర్యం వల్ల అతడిలో మార్పు వచ్చి, తను తన భార్యను యిన్నిరోజులుఉపేక్షించి తీరని ద్రోహం చేశానని బాధపడి, యికమీదట ఉషారాణితో ఎటువంటి సంబంధం పెట్టుకోరాదన్న నిర్ణయానికి వచ్చాక ప్రశాంతంగా నిద్రపోగలిగాడు ఆ నిద్రలోనే తనలోని అపరాధ వృత్తి కారణంగా ఏర్పడిన మానసిక గ్రంధి నుంచి విముక్తుడై ప్రశాంత చిత్తుడవ గలిగాడు. అతడి కల ఈ మానసిక ప్రశాంతతనే స్పష్టం చేస్తుంది.

రామానుజానికి ఉషారాణి నిజ స్వరూపం తెలుసో తెలియదో చెప్పలేం. తెలిసినట్టు మాత్రం ఎక్కడా ప్రవర్తించడు. తన భార్యకు మగస్నేహితులు వుండడానికి అభ్యంతరం పెట్టడం గాని, ఆమెను శంకించి [illegible] చేయడు. పైపెచ్చు ప్రోత్సహిస్తున్నట్లే కనిపిస్తాడు. అయితే అంతర్గతంగా భార్య వ్యవహారం పట్ల అసంతృప్తి ఒకవైపు, లోకం ఏమనుకుంటున్నారో అన్న భయం మరోవైపు అతడిని ప్రశాంతంగా బ్రతకనీయవు. అందుకే పీడకలలు వచ్చినప్పుడల్లా ఒంటరిగా వుండలేక (యిద్దరూ వేర్వేరుగా పడుకోవడం వల్ల) ఆమె నిద్రకుభంగం కలిగించకుండానే ఆమె పక్కన పడుకుంటూ వుంటాడు. అతడు వర్ణించే కలలో అంతర్గతంగా అతడు అనుభవించే సంఘర్షణ స్పష్టం అవుతుంది. 'మదించినఏనుగులు' ఉషారాణి స్నేహం కోరేవారయితే, ఆ ఏనుగుల కుమ్ములాటలో కూలిపోయిన కొండనుంచి తప్పిన నాగేంద్రుడు రామానుజంలో అంతర్గతంగా వున్న సమాజ భయం కావచ్చు, అంటే సామాజిక మర్యాదలను ధిక్కరించడం వల్ల లోకం ఈసడింపులను భరించవలసి వస్తుందన్న భయం, పిరికితనం దీని వల్ల వ్యక్తం అవుతుంది.

ఇక ఉషారాణికి వచ్చిన కలను వర్ణించడంలో రచయిత భర్తనుంచి ఆమె ఎటువంటి ప్రవర్తనను ఆశిస్తుందో, ఆమెలో అంతర్గతంగా ఎటువంటి కోరిక

ఉన్నాయో స్పష్టం చేశాడు. భర్తనుంచి ఆశించి నది లభ్యంకాక పోవటం వల్లగాని, మరి యితర కారణాలవల్ల గాని ఆమె చాలమంది పురుషులతో స్నేహం చేస్తుంది. ఆమె ఈ ప్రవృత్తిలోనే విశిష్టత అంతా వుంది. ఆమె తన కోరికలను దాచుకునే ప్రయత్నమేం చేయకుండా వాటిని యథాతథంగా స్వీకరించ గలగటం వల్ల ఆమెలో ఎక్కడా తాను తప్పుచేస్తున్నానన్న వ్యథలేదు. చేతనలో గాని వుప చేతనలోగాని ఎటువంటి అలజడిగాని సంఘర్షణ గాని లేదు.

ఇక్కడ మరో విషయం ప్రస్తావించడం అవసరం. ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంత ప్రభావంతో సాహిత్య రచనల్లో 'అధివాస్తవికత'కు కూడా ప్రాముఖ్యత లభించింది. ఉపచేతనలో ప్రక్షిప్తంగా వుండే మానసిక వృత్తులలోనే మనిషి జగత్తులోని వాస్తవికతలను గ్రహించడమే నేటి వాస్తవిక స్వరూపం యిమిడి వుంటుందన్నది ఈ సిద్ధాంతసారం. అందుకే బాహ్య జగత్తులోని స్థితి గతుల విశ్లేషణకంటే మానసిక జగత్తులోని స్వప్న సాహిత్యకారుడి అభీష్టం. ఈ సిద్ధాంత ప్రభావం వల్లనే గోపీచంద్ ఉషారాణిలోని కళాకారిణి తన వుపచేతనలోని భావవీచికలను ప్రేమలేఖలరూపంలో వ్యక్తం చేయడం చూపించాడు. తన ఆవేశాలు ఏదో ఒక రూపంలో బహిర్గతం అయ్యేవరకు ఊపిరాడక సతమతమయినా, ఆ తర్వాత వుపశాంతిని పొంద గలుగుతుంది. ఆమె వ్రాసినదంతా ఆమె స్వయంగా అనుభవించిన జీవితం. దాన్ని యథాతథంగా స్వీకరించబట్టే ఆమెలో ఎటువంటి ఘర్షణ లేదు. అలా కాకుండా ఎప్పుడైతే మనిషి వాస్తవికతలను కప్పేసి జీవితంపట్ల కృత్రిమ దృష్టి ఏర్పరచుకుంటాడో అప్పుడే అనేక దురభిప్రాయాలకు భ్రమలకు గురి అవుతాడు. తన సహజానుభూతులకు ఎటువంటి ముసుగులు వేయకుండా తను చేయదలచుకున్నది చేసేస్తూ జీవితాన్ని దాని దారిన దాన్ని పోనిచ్చింది కాబట్టే ఎక్కడా ఆమెలో కృత్రిమత్వం కనిపించదు అంతేకాకుండా పైకి వృత్తములుగా నటిస్తూ లోపల మనస్సును నింపుకుని ప్రవర్తించే చంద్రవదనులని ఆమె అసహ్యించుకుంటుంది. అసలు మనసులో ఏవో కోర్కెలు పెట్టుకుని దగ్గరచేరి తనకు అనుకూలంగా అనేక భ్రమలు సృష్టించుకుని, అవి తీరనప్పుడు కలంపట్టి నానా చందాల వ్రాయటాన్ని అందుకే ఆమె భరించలేక పోతుంది. అంటే తన మనసుకు నచ్చిన నిర్ణయాలు తీసుకోవడంలో ఆమె వ్యక్తివాద సిద్ధాంత ప్రముఖ లక్షణమైన వ్యక్తి స్వేచ్ఛకు ప్రాముఖ్యతను యిచ్చిందనటం స్పష్టమవుతుంది.

ఈ వ్యక్తివాద ధోరణిని స్పష్టం చేసేందుకు అస్తిత్వవాదుల సిద్ధాంతాలు కూడా వుపకరిస్తాయి. అయితే సార్త్ర్ వ్యక్తిలోని స్వాతంత్ర్యేచ్ఛ ఒకరకంగా అతడికి అభిశాపమే అంటాడు. ఎందుకంటే వ్యక్తి తన సహజ జ్ఞానంతో తనకు చెందవలసిన అధికారాలను దక్కించుకునే ప్రయత్నంలో జీవిత విలువలను కూడా నిర్ధారించుకుని తదనుగుణంగా తన భవిష్యత్ కార్యక్రమాన్ని రూపొందించుకుంటాడు. అంటే సంపూర్ణ నిర్ణయాధికారాలు అతడికి వున్నాయి. అయితే ప్రతివ్యక్తి తనకు నచ్చిన విధంగా తన జీవితాన్ని మలచుకునే ప్రయత్నంలో యితర వ్యక్తుల ప్రయత్నాలకు అవరోధం కలిగిస్తూవుంటాడు. తత్ఫలితంగా సంఘర్షణలకు, మానసిక వత్తిడులకు గురికాక తప్పదు. అయితే వ్యక్తి స్వార్థాన్ని విడనాడి తన కర్తవ్యాన్ని మరవక ముందుకు సాగటంలో నిష్క్రియతను ఆహ్వానించక తన నిర్ణయాలకు సక్రియరూపం కల్పించే విధంలో నిరర్థకమైన జీవితానికో సార్థకతను ఆపాదించుకునే ప్రయత్నం చేస్తాడు. అందులోనే అసలైన సంతోషము సంతృప్తి పొందుతాడు. అయితే ఈ సంతృప్తిని సార్థకతను పొందాలంటే వైయక్తిక స్వేచ్ఛను కాపాడుకోవటం అవసరం.

అయితే ఉషారాణికి ఈ వాదాల గురించి పెద్దగా తెలియదు. చక్రవర్తిని అడిగి తెలుసుకుంటూ వుండేదిగాని తనెందుకిలా అందరికీ విరుద్ధంగా ప్రవర్తిస్తుందో ఆమెకి ఎంతకీ అంతుబట్టదు చక్రవర్తి-శ్రీకాంత్‌లతో తన స్నేహం విషయం తెలిస్తే భర్త బాధపడతాడని తెలుసు. ఆమెకు భర్తంటే అయిష్టమంటూ ఏం లేదు. అయినా పరపురుషుల వైపు ఎందుకు ఆకర్షింపబడుతుందో, తన మనసు యిటువంటి ఆవేశాలకు ఎందుకు లోనవుతుందో అర్థం అవదు. అది తప్పే అయితే ఆ లోపం ఏదో తనలోనే వుండాలి. అదే నిజమైతే తను చెయ్యగలిగింది ఏమీలేదు. బుద్ధికి తోచిన విధంగా పోవడం కంటే గత్యంతరం ఏం లేదు. ఈ ఆలోచన వల్లగానే ఆమెకు ఏ మాత్రం భయంగాని కంగారుగాని వుండదేమో. సామాజిక విలువలను ఖాతరు చేయక పోవటం బాగున్నట్టుగ మాత్రం అనిపించదు. అయితే సంప్రదాయ సిద్ధంగా పోయేవాళ్ళు, సామాజిక విలువలను పాటించేవారి అందరి బ్రతుకులు ఒకేలా అంతమవుతున్నాయి గనుకనా తాను బెదిరి పోయేందుకు! అనుకుని సామాజిక మర్యాదలను పట్టించుకోకుండా తన మనోశరీరాల సహజవాంఛలను కప్పిపుచ్చుకోకుండా నిర్వికారంగా బ్రతకగలిగింది.

దీన్నిబట్టి వ్యక్తివాదం శాశ్వత విలువలను ధిక్కరించడమే కాకుండా బౌద్ధిక ప్రతిక్రియకు సాధారణంగా యివ్వబడే ప్రాముఖ్యతను యిచ్చేందుకు కూడా తిరస్కరిస్తుందని చెప్పవచ్చు. వ్యక్తి తన బుద్ధిబలంతోనే సామాజిక జీవితంలోని అస్తవ్యస్థతను నిర్మూలించి క్రమబద్ధతను తెచ్చేందుకు కొన్ని కట్టుబాట్లను, నీతి నియమాలను ఏర్పాటు చేసుకున్నాడు. అయితే ఈ కట్టుబాట్లను మనసు అతిక్రమించినప్పుడు వివేకం నశిస్తుందనే చెప్పవచ్చు. అయితే ఎప్పుడైతే బుద్ధి బలానికి ప్రాముఖ్యత నశిస్తుందో అప్పుడు సమాజం ద్వారా నిర్ధారింపబడిన విలువలకు ఆచారాలకు కూడా విలువ తగ్గుతుంది. తత్పరిణామంగానే మనిషిలోని పశు ప్రవృత్తులకు, వాంఛలకు సహజ ప్రవృత్తులుగా స్వీకృతి లభించటం వల్ల సామాజిక మర్యాదలకు విలువతగ్గి కేవలం వ్యక్తి స్వేచ్ఛకు యిష్టాలకు మాత్రమే విలువ లభించింది. అందుకే ఈ ప్రకృతి వాదానికి వ్యక్తివాదంలో ఒకభాగంగా స్వీకృతి లభించింది.

ఈ సిద్ధాంతాలన్నింటినీ వర్తింపచేసుకున్న వ్యక్తి కమలాకరం. మనిషిని కేవలం మనిషిగానే చూడాలన్నది అతడి అభిమతం. అనవసరమైన అపార్థాలను సృష్టించుకుంటూ పోయి తమ జీవితాలను దుఃఖభూయిష్టం చేసుకునే కంటే తమ ఆలోచనలకు తామే బానిసలై వెత చెందటం కంటే అవసరమనుకున్నప్పుడు సామాజిక కట్టుబాట్లను అధిగమించి బ్రతక కలగటం మెచ్చుకోదగ్గ లక్షణం అని అతడి అభిప్రాయం. అందుకు తగ్గట్టే ఎటువంటి కపటము లేకుండా తనకు కావలసినవి పొందే ప్రయత్నం చేయటం వల్లనే చెక్కుచెదరని మనస్థైర్యంతో తొణుకు బెణుకు లేని రీతిలో జీవితాన్ని అనుభవించగలిగాడు-ఉషారాణికి ఆత్మీయుడు కాగలిగాడు ఉషారాణి మానసిక ప్రవృత్తిని సానుభూతితో అర్థం చేసుకోగలిగిన వ్యక్తి. తనొక్కడే సంఘంలో వివాహం అవసరం లేని స్థితిలో మనిషి ఎప్పుడూ మునుపటి మృగదశకే చేరుకుంటాడన్న నియమం ఏమీలేదు. వివాహబంధనలను అధిగమించిన వ్యక్తి రాక్షసుడే అవుతాడనేం లేదు. దేవతగా కూడా మారవచ్చు-అది అతడి సంస్కారం-ప్రయత్నంపైన ఆధారపడిన విషయం. అది తెలిసినవాడు కాబట్టే కమలాకరం అంత వుదారంగా ఆలోచించగలిగాడు-వ్యవహా

రించగలిగాడు సంస్కారహీనుల సృష్టిలో అంతటి నీచమైన (!) జీవితం గడిపిన తర్వాత మహా యోగిగా మారటం అసాధ్యం. అయినా కమలాకరం అంచనాలమేరకు ఉషారాణి ఆ దైవత్వాన్ని పొందగలిగింది.

బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' లోను, వడ్డెర చండీదాసు 'హిమజ్వాల' లోను ఈ రెండు రచనల్లోను ఎక్కువగా ఇటువంటి వ్యక్తులే మనకు తారసపడతారు. వీరిలో సాధారణమైన నైతిక సూత్రాలను దాటగల మనస్తత్వం కనిపిస్తుంది. వీరంతా వ్యక్తిగతమైన అనుభూతులను నికృష్టమైనవిగా త్రోసి పుచ్చకుండా తమ అంతరంగిక అనుభూతుల తీవ్రతను, విశిష్టతను గుర్తించినవారు. ఇటువంటి వారివల్ల సాంఘిక జీవితం దూషితం కాగలదన్న భయాన్ని కొంతమంది వ్యక్తం చేయకపోలేదు. అయితే సానుభూతితో ఆయా వ్యక్తుల భావానుభూతులను-ఉదాత్తుడు-పతితుడు అనే భేదాలకు అతీతంగా వ్యక్తి అంతరంగాన్ని దర్శించి, ఆతడికే అంతు బట్టని అతడి అంతర్గత ప్రవృత్తులను తమ రచనల్లో విశ్లేషించి చూపించారీ రచయితలు. మరో రకంగా చెప్పాలంటే జగద్వాస్తవికతను తనవ్యక్తి చేతనతో ప్రతిఫలింపచేస్తూ సాహిత్యరచనలు చేసే ప్రయత్నంలో వ్యక్తి పశ్యంతిలో కొంత అవ్యక్తంగాను కొంత సూచ్యంగాను మిగిలిపోయిన అంశాలను సూక్ష్మ అంతర్దృష్టితో నిరీక్షించి సమీక్షించాలన్న వైఖరి వ్యక్తివాదులలో కనిపిస్తుంది. ఈ రకంగా వ్యక్తి మనసులో దాగిన ఆలోచనలు-ఆందోళనలు, జ్ఞాపకాలు-బాధలు, కలలు-కన్నీళ్ళు అన్నిటినుంచి అతిడికి ముక్తిని కలిగించి మనోప్రక్షాళనకు అవకాశం కల్పించాలన్నదే వ్యక్తివాద రచనల ముఖ్యోద్దేశం.

రీడర్, పి. జి. కాంప్లెక్స్,
ద. భా. హిందీ ప్రచార సభ,
టి. నగర్, మద్రాసు-17.

విజ్ఞానదానము. ప్రాణదానము ముఖ్యమైన దానములుగా పరిగణింపబడినవి. ఈ రెండిటిలో మొదటి దానికే అగ్రతాంబూలం. ప్రాణ రక్షణచేయుట మంచిదే. కానీ దానికంటే జ్ఞానదాన ముత్తమమైనది. విద్యగరపి ధనమార్జించుట మంచిదికాదు. విద్యనొక వ్యాపారవస్తువుగా నెంచి దానికి బదులు ధనము గ్రహించుట సిగ్గుచేటు.

**స్వామి వివేకానంద**

పుస్తక సమీక్ష:

# 'చాటుపద్య మణిమంజరి' ప్రథమ-ద్వితీయ సంపుటాలు

— ఇప్పగుంట సాయిబాబా

ప్రతులు లభించుచోటు:
శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి స్మారకన్యాసం
2-2-18/15/3/1, బాగ్ అంబర్ పేట,
హైదరాబాదు-500 013.
ఒక్కొక్కటి 75-00

సుప్రసిద్ధ పరిశోధక-పండితుడు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సేకరించిన వందలాది చాటువులను తిరిగి పునస్సంశోధించి నాలుగు-ఐదు సంపుటాలను ప్రకటించదలచి, ప్రస్తుతము రెండు సంపుటాలను వెలువరించారు. సంపాదకులందుండు వందలాది చాటువులుండుటచేతను కాలము తక్కువగుటచేతను కాబోలు, పునస్సంశోధితము చక్కని ప్రణాళికతో రూపుదిద్దుకొనలేదు, పైపెచ్చు సంపాదకులు ప్రొఫెసర్ జి. లలితగారి అమూల్య గంథము 'తెలుగులో చాటుకవిత్వము'ను కాని, శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు-శ్రీ బాలాత్రిపుర నళినీకాంత రావు సునిశిత విమర్శనాగ్రంథము 'తెలుగు చాటువు'ను కాని చూడకపోవుట విచారకరము.

నేటికిని తెలుగులో సునిశిత సంశోధిత విమర్శనాపద్ధతి సాధుకొనలేదు. చా. మం. సంపుటాలలో పెక్కు శతకపద్యాలను స్వీకరించి, చాటువులుగా వెలామణి చేయడం చింత్యము. అటులే 'విరుదావళులు' కూడ. వీటిని పరిహరించి ఉంటే బాగుండేది. వావిళ్ళవారు ఎప్పుడో పూర్తిగా ప్రచురించిన నరభూపాలంకలింగ-గువ్వలచెన్న శతక పద్యాలను స్వీకరించకుండ ఉంటే బాగుండేది. సంస్కృత చాటువులను వేరేసంపుటంగా వెలువరిసే ఇది ఒక అందం.

ఈ సంపుటాలలోని మరొక అసౌకర్యం ఒకేకోవకు లేదా ఒకేవ్యక్తికి చెందిన చాటువులు ఒకచోట ముద్రించబడలేదు. బహుశా సంపాదకులు అలవోకగా ముద్రణప్రతిని తయారుచేసినట్లున్నది.

రామావధూటి తారావళి లోని కొన్ని పద్యాలు క్రీడాభిరామ పీఠికలో ముద్రింపబడి ఉన్నవి అను సంగతే సంపాదకులు మరచారు.

తెలుగు సాహిత్యాన్ని పునరుజ్జీవింపజేసిన ఛార్లెస్ బ్రౌన్ దొరగారే వేలాదిచాటువులు సేకరించారు. మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం లోని డి 1050-58, డి 2522-33, డి 2537, డి 2587- తాళప్రతులలో చాటువులు సంకలింపబడి ఉన్నాయి. అంటే 23 తాళపత్రగ్రంథాలు చాటుపద్య సంపుటాలుగా ఉన్నాయన్నమాట. కాని వీటిని పరిశీలించే తెలుగు పరిశోధకులకు తెలుగు దేశం జన్మనివ్వవలసి ఉన్నది.

# వార్తావాహిని

## హిందీ విద్యార్థి మేళా

ది. 22-7-1990 ఉదయం 10 గంటలనుండి సాయంకాలం 4. గం॥ల వరకు హిందీ డిగ్రీ కళా శాల (మాచవరం, విజయవాడ)లో దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర, విజయవాడ శాఖ వారి ఆధ్వర్యమున దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాద్. సెక్రటరీ కుమారి ఎస్.జి. వసంత గారి సూచన ప్రకారం హిందీ విద్యార్థి మేళా ఉత్సాహ పూరిత వాతావరణంలో జరిగింది. గాంధీ పర్వత హిందీ మహా విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ చర్ల జనార్ధనస్వామి గారి జాతీయ గీతాలాపనతో కార్యక్రమం ప్రారంభమైనది.

ప్రారంభ తరగతులు బి యిడి. గదుల్లోను ఉన్నత తరగతులు బి.ఎ. భవనంలోను ఏర్పాటు చేయబడినవి. ప్రతి పిరియడ్ 45 నిమిషములు చొప్పున ప్రతి తరగతికి ౮ పరియడ్‌లు నిర్ణయం చేసి పాఠములను బోధించడమైనది. గం. 12.45 నుండి 1,45 వరకు వున్న విరామ సమయంలో పాల్గొనిన విద్యార్థులకు అల్పాహారము ఏర్పాటు చేయడమైనది. తరగతులను బోధించిన హిందీ ప్రచారకులు సర్వశ్రీ కొడాలి రామారావు, ఎం. గోపాలకృష్ణమూర్తి, ఎన్. రామకోటేశ్వరరావు, చర్ల జనార్ధనస్వామి, సి.హెచ్. కామాక్షి, పి. ప్రభావతి. బి.కె డి వరలక్ష్మి. పి.మైథిలీ, జి సత్యనారాయణ మూర్తి, సి.హెచ్. పర్వతవర్ధిని, డి. రాజ్యలక్ష్మి, పి శ్రీనివాసరావు, రమేష్‌బాబు, కె. కోటేశ్వరరావు, జి. పద్మావతి, టి. తులసి, జి. లక్ష్మి ప్రసన్న, దేవరాజ కుమార్, అల్లు జయలక్ష్మి, మిక్కిలినేని సుబ్బారావు ఈ కార్యక్రమం జయప్రదం అగుటకు తోడ్పడినవారు:- శాఖా కార్యాలయ కార్యకర్తలు, సిబ్బంది యితర ప్రముఖ

---

ప్రథమ సంపుటంలోని 338 పద్యం చాటువు కాదు. ఏర్చూరి సింగన కృత కువలయాశ్వచరిత్రలో.. ది॥ ప్రబంధరత్నావళి చెప్పుచున్నది. రెండవ సంపుటపు అకారాది పద్యసూచికతో ప్రథమ సంపుటపు అకారాదిపద్య సూచికను పోల్చి ఉన్నచో పునరుక్తులు దొర్లకుండ ఉండెడివి ఉదాహరణకు ప్రథమ సంపుటంలోని 78 పద్యం, రెండవ సంపుటంలో 891 పద్యంగా అవతరించింది. కాని చిత్రంగా పద్యానుక్రమణికలో లేదు.

ఒక ప్రాచీన గ్రంథాన్ని కాని, లేక పూర్వకవి పద్యాలతో కూడిన సంకలన కృతిగాని, సరిగా, టిప్పణులతో వెలువరించడానికి తెలుగు సాహిత్యలోకానికి ఎన్ని ఏండ్లు పట్టునో ఈ చాటు పద్యమంజరులు చెప్తాయి.

రెఫాహ్-యీ-ఆమ్, హరిబౌలి,
హైదరాబాదు-500 275

ప్రచారకులు వానాకాలం అయినప్పటికిని 350 మంది విద్యార్థులకు, వారి ఉపాధ్యాయులకు అన్ని విధాల సౌకర్యం సమకూర్చబడింది. ఈ కార్యక్రమాన్ని ప్రోత్సాహించిన వారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర సెక్రటరీ గారు. వారికిని, యీ మేళాకు సహకరించిన వారి కందరికి మా ధన్యవాదములు.

## శ్రీ సరస్వతి హిందీ విద్యాలయం 39వ వార్షికోత్సవము

శ్రీ సరస్వతి హిందీ విద్యాలయం 39వ వార్షికోత్సవము జూలై 15వ తేదీన స్థానిక లక్ష్మీశ్వర సమ్మ కాన్వెంటు నందు జరిగినది. సభకు అధ్యక్షత వహించిన శ్రీమతి దాట్ల సత్యవతి రాజు (ఆదర్శ మహిళా సంస్థ) మాట్లాడుచూ 'సరస్వతి' అన్న నామధేయము సార్థకము చేసుకున్న విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీమతి కూరెళ్ళ సరస్వతి దేవి ఓర్పు నేర్పులతో హిందీ భాషా వ్యాప్తికి చేయుచున్న సేవలను కొనియాడారు. దక్షిణ భారత దేశంలో 'హిందీ విశిష్ట సేవా పతకము' పొందిన శ్రీ సరస్వతీదేవి ఆంధ్ర రాష్ట్రానికే గర్వ కారణం అన్నారు. ఈ విద్యాలయంలో విద్యా బోధన గురించి వివరిస్తూ విద్యాలయ విద్యార్థిని కుమారి త్రివేణి రాధిక, విశారద ఉత్తరార్థపరీక్షలో ఆంధ్రలో ప్రప్రథమ ఉత్తీర్ణత పొందుట ఒక మచ్చు తునక అని అన్నారు.

శ్రీ సరస్వతి దేవిని దక్షిణ భారత హిందీ ప్రచార సభ (మద్రాసు) వారిచే పంపబడిన 'సువర్ణ విశిష్ట సేవా పతకము', దుశ్శాలువ, ప్రశంసా పత్రములతో గౌరవించారు.

కుమారి త్రివేణి రాధికను 'సువర్ణపతకము'తో ఆశీర్వచనములతో గౌరవించారు.

శ్రీ సరస్వతి హిందీ విద్యాలయం తరఫున శ్రీమతి సరస్వతి దేవిచే విద్యా ప్రచారక్ 'మాస్టర్ కోరా' గార్కి, శ్రీమతి కె. అన్నపూర్ణాశాస్త్రి గార్కి (కవయిత్రి), 'హిందీ పండిట్' శ్రీ అయినపర్తి లక్ష్మణరావు గార్కి నూతన వస్త్రములు దుశ్శాలువలతో సన్మానము జరిగినది.

సన్మానితులు తమతమ కృతజ్ఞతలు తెలియ చేసిరి కవయిత్రి శ్రీమతి కె అన్నపూర్ణాశాస్త్రి తాను రచించిన 'శ్రీదేవి అష్ట శతమాల' నుండి కొన్ని ముఖ్యాంశాలు చదివి వినిపించిరి.

వక్తలు శ్రీ రాడూరి కృష్ణారావు, శ్రీ చేబోలు శేషగిరిరావు' శ్రీ ముళ్ళపూడి సూర్యనారాయణ మూర్తి గార్లు తమ ప్రసంగంలో శ్రీ సరస్వతీదేవి చేయుచున్న కృషిని కొనియాడిరి. విద్య కేవలం ప్రమాణ పత్రములు పొందుట కొరకే పరిమితం కారాదని, నేటి భారతీయ సమైక్యత హిందీ భాషాభివృద్ధిలోనే ఉన్నదని నొక్కి వక్కాణించారు. దేశ సమైక్యతే స్వరాజ్య రక్షణ కవచమని అన్నారు.

కార్యదర్శి శ్రీ యన్ కె యన్. రాజా విద్యాలయ వార్షిక నివేదికను చదివి వినిపించారు.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ సభ్యులు శ్రీ యలమర్తి పోలేశ్వరరావు గారు ప్రమాణపత్ర వితరణ గావించారు భవిష్యత్తులో విద్యాలయం మహా విద్యాలయంగా రూపొందగలదని అభిలాషించారు.

విద్యాలయం విద్యార్థినులచే నృత్య, గాన ప్రదర్శనలు గావింపబడినవి అధ్యక్షురాలిచే జ్ఞాపికలు బహూకరించబడినవి,

శ్రీ నిమ్మలపూడి అమృతరామన్న (సహాయ ప్రచారక్) వందన సమర్పణ గావించారు.

## నిడదవోలు హిందీ ప్రేమీ మండలి హిందీ విశారద విద్యాలయము ప్రమాణపత్ర వితరణోత్సవము మరియు బహుమతుల ప్రదానోత్సవము

ది. 22-7-90 నాటి సాయంకాలము 5 గంటలకు స్థానిక కస్తూరిబా మహిళా సమాజ భవనమందు నిడదవోలు హిందీ ప్రేమీమండలి- హిందీ విశారద విద్యాలయము ప్రేమీమండలి అధ్యక్షులు అయిన శ్రీయుతులు, యస్. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన విజయపత్రోత్సవము బహుమతుల ప్రదానోత్సవమును జరుపు కున్నది. సభకు ముఖ్యఅతిథిగా శ్రీయుతులు అత్యం నాగేశ్వరరావుగారు,(యమ్.డి.ఆనంద వెంకటేశ్వర బాయిల్డ్ రైస్ మిల్,బ్రాహ్మణగూడెం) విచ్చేసిరి. సభకు శ్రీయుతులు వై.వి. చౌదరిగారు( ప్రిన్సిపల్, గవర్నమెంట్ జూనియర్ కాలేజి,నిడదవోలు) శ్రీయుతులు. ఎ. రాధాకృష్ణగారు (ప్రిన్సిపల్ సరస్వతి విద్యాలయ కాన్వెంట్ నిడదవోలు) శ్రీ యుతులు కె. కృష్ణమూర్తిగారు (అధ్యక్షులు, ఖాదీభండారు, తూర్పుగోదావరిజిల్లా, రాజమండ్రి) శ్రీయుతులు ఎ. పాండురంగ (ఈనాడు పత్రికా విలేకరి, నిడదవోలు) గారువిచ్చేసిరి.

సభకు విద్యార్థులు సుమారు 160 మంది హాజరయిరి ముంగర శాంతకుమారి,పద్మకుమారిల యొక్క ప్రార్థనాగీతముతో సభ ప్రారంభమయ్యెను. సభను శ్రీ యస్. సుబ్రహ్మణ్యంగారు ప్రారంభించిరి.

ముఖ్యఅతిథిగార్ని సభాధ్యక్షులు పూలమాలాలంకృతులను చేసిన తరువాత కార్యదర్శి తన 'వార్షిక నివేదిక' చదివి వినిపించెను. ముందుగా సభ తరుపున ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి గౌరవనీయులు అయిన శ్రీ డా॥ మర్రి చెన్నారెడ్డిగార్కి ఆరవ తరగతినుండి హిందీ ప్రవేశమునకు అనుమతించినందుకు కృతజ్ఞత తెలియపరచిరి.

ముఖ్యఅతిథి శ్రీ ఎ. నాగేశ్వరరావుగారు ప్రతిసంవత్సరము 10 మంది పేదవిద్యార్థులకు పుస్తకాలను ఉచితముగా ఇవ్వగలనని వాగ్దానము చేసి అజీవన సదస్యునిగా తానుచేరి సభకు సేవ చేయ సంకల్పించినారు. ఇదే సమయమున సరస్వతి విద్యాలయము ప్రిన్సిపాల్ గారు శ్రీ ఎ. రాధాకృష్ణగారు 1990 ఆగష్టుకి ప్రారంభికనుండి పెద్దతరగతులవరకు సర్వప్రథమ మార్కులు తెచ్చుకొన్నవారికి 116/- రూ విరాళముగా ఇస్తానన్నారు. అందరితో పాటు తానుకూడా సభకు ఆజీవన సదస్యునిగా చేరి తన అభిమానము ప్రకటించిరి.

గతములో వాగ్దానము చేసిన ప్రకారము ఇప్పుడు శ్రీ యస్ సుబ్రహ్మణ్యంగారు (అధ్యక్షులు హిందీ ప్రేమీమండలి, నిడదవోలు)న్ను శ్రీ కె కృష్ణమూర్తిగారు (అధ్యక్షులు ఖాదీభండారు, రాజమండ్రి)న్ను, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షలలో 1990 ఫిబ్రవరిలో సర్వప్రథమ మార్కులు తెచ్చుకొన్న విద్యార్థులకు 'హిందీ-తెలుగు కోష్' 50 రూ విలువకల్గినది బహుమతులుగా ఇచ్చిరి.

సభకు విచ్చేసిన గవర్నమెంట్ జూనియర్ కాలేజి ప్రిన్సిపల్గారు శ్రీ వై. వి చౌదరిగారు బాలభారతీ కాన్వెంట్స్కూలు హిందీపండితులు అయిన కుమారి వి. స్వరాజ్యలక్ష్మిగార్ని శాలువా

కప్పి పండితసన్మానము చేసిరి. అదే సమయమున తానుకూడా సభకు ఆజీవన సదస్యునిగా చేరి సభ పట్ల వారి అభిమానమును ప్రకటించిరి.

శ్రీ అత్యం నాగేశ్వరరావుగారు ప్రాథమిక నుండి ప్రవేశిక వరకు ఉత్తీర్ణులైనవారికి విజయ పత్రములు పంచిఇచ్చిరి.

శ్రీ ఎ. రాధాకృష్ణగారు హిందీ ప్రేమీమండలి వారిచ్చిన సర్వప్రథమ బహుమతులు పంచిఇచ్చిరి.

శ్రీ కె. కృష్ణమూర్తిగారు హిందీ వ్యక్తృత్వ, వ్యాసరచన పోటీలలో గెలుపొందిన వారికి బహుమతులు పంచి ఇచ్చిరి.

శ్రీ యస్. సుబ్రహ్మణ్యమ్‌గారు ప్రేమీమండలి ఉపాధ్యాయులకు ప్రోత్సాహక బహుమతులను పంచి ఇచ్చిరి.

అనంతరం సభకు విచ్చేసినపెద్దలు సభనుద్దేశించిమాట్లాడిరి.బాలబాలికలు తమభావములను హిందీలో తెలియపరచిరి.

అనంతరము ముఖ్య అతిథిగారైన శ్రీ అత్యం నాగేశ్వర రావుగార్ని ప్రేమీమండలి కార్యదర్శి శ్రీ యస్. సిహెచ్. యస్. శర్మ శాలువాకప్పి సన్మానించిరి.

సాయంత్రము గం॥ 8-30 ని॥ లకు కార్యదర్శి వందన సమర్పణ చేయగా సామూహికముగా 'జనగణమణ' జాతీయ గీతాలాపనతో సభ స్నేహ పూరిత వాతావరణములో జయప్రదముగా ముగిసినది.

అనంతరం బాలబాలికలకు మిఠాయిలు పంచి ఇచ్చిరి.

## హిందీప్రేమీ మండలి : రాజమండ్రి

### హిందీ విద్యార్థిమేళా, ప్రమాణపత్ర వితరణోత్సవ సభ

22-7-90వ తేదీన ప్రేమీమండలి అధ్యక్షులు డా॥ చేబోలు శేషగిరిరావుగారి అధ్యక్షతన జరుపబడెను. సభకు రాజమండ్రి మున్సిపల్ ఛైర్మన్ (ఇన్‌చార్జ్) శ్రీ చల్లా అప్పారావు గారు ముఖ్య అతిథిగా ఆహ్వానింపబడిరి. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ దాసరి సుబ్బారావుగారు సభా ప్రారంభకులుగా ఆహ్వానింపబడిరి. ప్రేమీమండలి కార్యదర్శి శ్రీ యంమర్తి పోలేశ్వరరావుగారు స్వాగతం పలికి వారిని వేదికపైకి ఆహ్వానించిరి. కుమారి సి. హెచ్. సూర్యకాంతముగారు మరియు శ్రీమతి యన్. వరలక్ష్మి విద్యార్థినులచే ప్రార్థనతో సభ ప్రారంభమయ్యెను.

అధ్యక్షులు తమ ఉపన్యాసములో యాభై సంవత్సరాల ప్రగతిని గూర్చి మాట్లాడుతూ, ఆంధ్రలో విశేషమన్ననలందుకుంటున్న ఇందలి విద్యార్థులకు హిందీభాషాబోధన చేస్తున్న ప్రేమీ మండలికి స్వంత భవనము లోటు ఒక్కటే పెద్ద లోటుగా కనిపించుచున్నదని, ప్రేమీమండలి కృషి చే సేకరించిన మూలధనం కొంతవున్నదని. అధికారులు మునిసిపల్ చైర్మన్‌గారు ఏ కొంతయో స్థలాన్ని, ఎక్కడైనా మంజూరుచేసి యిప్పించిన, స్వంతభవనము ఏర్పాటు చేసుకుని అమితోత్సాహంతో ఎక్కువమందికి హిందీ భాష సేవ ఈ ప్రేమీమండలి చేయగలుగుతుందని చెప్తూ, మన ముఖ్యమంత్రి శ్రీ చెన్నారెడ్డిగారు జాతీయ భాష హిందీని పాఠశాలలో తిరిగి 6, 7 తరగతులలో బోధించుటకు నిర్ణయం తీసుకొని, హిందీ ప్రచారకులకు నూతన ఉత్సాహాన్ని కలిగించారని వారికి ధన్యవాదాలు తెలిపినారు.

తదుపరి సభాప్రారంభకులు శ్రీ దాసరి సుబ్బారావుగారు హిందీ భాష ప్రాముఖ్యమును గూర్చి, జాతీయభాషాభివృద్ధికి తీసుకొనవలసిన అంశములను గూర్చి విపులంగా ఉపన్యసించిరి.

ప్రేమీమండలి కార్యదర్శి వై. పోలేశ్వరరావు గారు కార్యదర్శి నివేదికను చదివి వినిపించిరి.

ముఖ్యఅతిథి మున్సిపల్ చైర్మన్ (ఇన్‌చార్జి) శ్రీ చల్లా అప్పారావుగారు మాట్లాడుతూ ఈ ప్రేమీ మండలి చాలాకాలము నుంచి హిందీభాషకు ఎంతో సేవ చేస్తున్నదని సంతోషం వ్యక్తంచేస్తూ ఇంత మంది విద్యార్థినీ విద్యార్థులు హిందీని ఉత్సాహంగా నేర్చుకుంటున్నారని, అధ్యక్షులవారు భవనం లేక స్థలాభావంవల్ల అనేక ఇక్కట్లు పడుచున్నారని తెలిపి మాకు చేతనైనంతవరకు ఎక్కడో ఒకచోట ప్రేమీమండలికి కొంతస్థలాన్ని ఇప్పించుటకు శాయిశక్తులా ప్రయత్నంచేస్తానని కరతాళ ధ్వనులమధ్య ప్రకటించిరి. వారు జాతీయభాష హిందీని అందరూ నేర్చుకోవాలని ఆ భాషద్వారా మనము దేశంలో అందరితో సన్నిహితంగానూ, స్వతంత్ర్యంగానూ మాట్లాడుకోగలమని, ప్రజలను ఒకేత్రాటిపై నడిపించగల శక్తి ఈ ఒక్క హిందీ భాషకే ఉన్నదని ఉద్బోధించిరి.

పిమ్మట ప్రేమీమండలి ఉపాధ్యక్షులు ఆదర్శ మహిళామండలి అధ్యక్షులు అయిన శ్రీమతి దాట్ల సత్యవతి దేవిగారు మండలిచే క్రొత్తగా కొనబడిన టైపుమిషనును ఆవిష్కరించిరి.

ప్రేమీమండలి ప్రతిసంవత్సరము హిందీ పండితున్ని, తెలుగుపండితుణ్ణి సన్మానించు ఆచారము కలగియున్నది. ఈ సంవత్సరము శ్రీ శిష్టా వెంకట సుబ్రహ్మణ్యముగారు (రిటైర్డ్ హిందీపండితులు), వై. హరిమోహనప్రసాదు (హిందీపండిట్) గార్లను చైర్మన్‌గారు పుష్పమాలాంకృతులనుచేసి, శాలువాను సమర్పించిరి. స్వర్ణపత్రగ్రహీత శ్రీమతి కె. సరస్వతీదేవిగారు ప్రిన్సిపాల్ సరస్వతీహిందీ విద్యాలయం, రాజమండ్రివారిని స్వర్ణపత్రగ్రహీత కుమారి పిన్నింటి త్రివేణరాధికను అభినందించుచూ సత్కరించిరి.

అనంతరము ఉదయం విద్యార్థిమేళాలో పాల్గొన్న ఎనిమిదిమంది హిందీ ప్రచారకులను చైర్మన్‌గారు సముచితరీతిలో సత్కరించిరి. విద్యార్థిమేళాలో పాల్గొన్న విద్యార్థులకు ప్రమాణ పత్రములు ఇవ్వబడినవి.

1990 ఫిబ్రవరిలో తూర్పుగోదావరి జిల్లాలోనూ, రాజమండ్రి పట్టణంలోనూ ప్రాథమికనుండి రాష్ట్రవరకు సర్వప్రథమ, ద్వితీయ వచ్చిన విద్యార్థులకు బహుమతీప్రదానం చేయడమైనది.

వివిధతరగతులకు విద్యార్థిమేళాలో సుమారు మొత్తం 180 మంది పాల్గొనిరి ఇందు కొవ్వూరు నుంచి 30 విద్యార్థులు విచ్చేసిరి. చాలా చక్కగా క్రమబద్ధంగా ఈ కార్యక్రమమును నిర్వహించారని చైర్మన్‌గారు ప్రశంసించారు.

అనంతరము శ్రీ చైర్మన్‌గారిచే 90 ఫిబ్రవరిలో ప్రాథమిక నుంచి ప్రవేశికవరకుగల పరీక్షలలో ఉత్తీర్ణులైన వారందరికి ప్రమాణపత్రములు ఇవ్వబడినవి. విద్యాలయం ప్రిన్సిపల్ శ్రీ యం. సూర్యనారాయణమూర్తిగారు వందన సమర్పణ చేసిరి. విద్యాలయ విద్యార్థినీ విద్యార్థులచే సాంస్కృతిక కార్యక్రమములు నిర్వహించబడినవి అనంతరం జనగనమణ జాతీయగీతంతో నాటి సభ ముగిసినది.

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ప్రచురణలు

| | |
|---|---|
| 1. హిందీ ప్రచార్ కా ఇతిహాస్ | 10-00 |
| 2 తెలుగు సాహిత్య వ్యాసములు | 5-00 |
| 3. వ్యాసమంజూష | 15-00 |
| 4. తెలుగు భాషా బోధిని-1 | 1-00 |
| 5. ,, 2 | 1-20 |
| 6. ,, 3 | 3-50 |
| 7. ,, 4 | 1-50 |
| 8. తెలుగు కథా మంజరి-1 | 1-00 |
| 9. ,, 2 | 1-00 |
| 10. తెలుగు రచనా-అనువాదం-1 | 0-75 |
| 11. ,, -2 | 1-00 |
| 12. తెలుగు పద్యమంజరి | 3-50 |
| 13. పద్యమాల | 6-00 |
| 14, కావ్యమాల | 10-00 |
| 15. తెలుగు గల్పమాల—గోదావరి హఁస్పడీ | 15-00 |
| 16. ఏక్ కలీ ఖిల్ ఉఠీ | 15-00 |
| 17. పూర్ణాహుతి | 15-00 |
| 18. మేరీ జీవనయాత్రా—ప్రథమభాగం (టంగుటూరి ప్రకాశంగారి ఆత్మకథ) | 8-00 |
| 19 టూట్‌తీ పరంపరాయేఁ | 15-00 |

## उच्च शिक्षा और शोध संस्थान के प्रकाशन

| | |
|---|---|
| 1. हिन्दी भाषा की सामाजिक भूमिका<br>डॉ. भोलानाथ तिवारी और मकुल प्रियदर्शिनी | 25-00 |
| ,, ,, विद्यार्थी संस्करण | 12-00 |
| 2. तुलनात्मक साहित्य की भूमिका<br>डॉ. इन्द्रनाथ चौधरी | 40-00 |
| ,, ,, विद्यार्थी सस्करण | 25-00 |
| 3. व्यावसायिक हिन्दी<br>डॉ. दिलीप मिह | 20-00 |
| ,, ,, विद्यार्थी सस्करण | 8-00 |
| 4. अनुवाद अवधारणा और अनुप्रयोग<br>संपादक : डॉ. चन्द्रभान रावत और डॉ. दिलीप सिंह | 50-00 |
| 5. शैलीतत्व :सिद्धान्त और व्यवहार<br>संपादक: डॉ.चन्द्रभान रावत और डॉ. दिलीप सिंह | 75-00 |

